ఓం

శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

# దేవుడెవరు?

(దేవుడెట్లు కనబడును?)







శ్రీ చిన్మయ రామదాసు

# విషయసూచిక

శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

# దైవప్రార్థన

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే.

శ్లో. సరస్వతీ మయం దృష్ట్వా వీణా పుస్తక ధారిణీ
హంసవాహ సమాయుక్తా విద్యాదానకరీ మమ.

శ్లో. ఆబ్రహ్మస్తంభపర్యంతం పరమాత్మ స్వరూపకమ్
స్థావరం జంగమంచైవ ప్రణమామి జగన్మయమ్.

శ్లో. పరమం పావనం పుణ్యం వేదజ్ఞం వేదమందిరమ్
విద్యాధారం మఖాధారం ప్రణవంతం నమామ్యహమ్.

శ్లో. వేదవ్యాసావతారాయ సత్యధర్మానువర్తినే
భవబంధవినాశాయ గురుదేవాయ తే నమః.

శ్లో. కృష్ణాయ ఆర్తినాశాయ యాదవేంద్రాయ శ్రీపతే
భక్తరక్షణ దీక్షాయ గోవిందాయ నమో నమః.

సీ. శంకరా పాపభయంకరా సర్వేశ
భవ రుద్ర యోదేవ పాహి పాహి
కైలాసగిరివాస గజచర్మధారి యో
పశుపతి సర్వజ్ఞ పాహి పాహి

ప్రమథనాథ మహేశ కమనీయగుణగణ్య
భక్తార్తిభంజన పాహి పాహి
ఈశానమూర్తి సర్వేప్సిత సంధాత
పరమపావననామ పాహి పాహి

తే. దివ్యమునివంద్య జగదీశ దేవ దేవ
పరమశాంతస్వభావ సుందరవిలాస
భుజగభూషణ శ్రీకంఠ భోగదాత
నందివాహన గొనుము మా వందనములు.

# పీఠిక

ప్రియమైన దైవాత్మ స్వరూపులారా,

కృతయుగాదులనుండి నేటివరకును ఋషులు, మునులు, యోగులు, మహాత్ములు, పరమభక్తులున్ను పురుషప్రయత్నము వలనను, దేవుని కృప వలనను జీవులకు ఇహపరసుఖములు చేకూరునని చెప్పిరి, చెప్పు చున్నారు.

ఈకాలములో ననేకులు ధనమునకు, భోగములకు, కీర్తికిన్ని దాసులై, దూరాలోచన చేయనివారై పురుషప్రయత్నమువలననే సర్వ మును సమకూర్చుకొనబడుచున్న వేగాని మనకు వేరుగా సుఖదుఃఖములు కలిగించునట్టి కర్త (దేవుడు) లేడని చెప్పుచున్నారు. కొందరు పుణ్య పాపములు లేవు, స్వర్గ నరకములు లేవు, పునర్జన్మము లేదు యని వాదించు చున్నారు.

లోకములో కొందరు విష్ణువే మోక్షమిచ్చునని, కొందరు శివుడే మోక్షమిచ్చునని, కొందరు దేవియే బంధవిమోచన కలిగించునని, కొందరు క్రీస్తే మోక్షదాతయని, కొందరు అల్లాయే స్వర్గప్రదాతయనియు వాదించు చున్నారు.

లోకములో కొందరు ఏ దేవుని నమ్మిన మోక్షము గలుగునో, ఏ మతమును నమ్మిన దుఃఖనివృత్తియగునో, ఏ యనుష్ఠానముచేసిన శాశ్వతాత్మ శాంతి చేకూరునో యనుకొనుచు సంశయములతో బాధపడుచున్నారు.

పై జెప్పబడిన వార లందరకును నిజము నెరిగించునను నమ్మకముతో ఈ గ్రంథమును వ్రాయడమైనది.

పౌరుషము, దైవముల గురించి భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన మూడు పద్యములు :

కం. క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర బీజ మరయ దైవము రెండున్
సూత్రపడ గూడె నేనిం
బాత్రంబగు కర్మకరుడు ఫలమున కెందున్.

తే. పౌరుషమ్ము దైవంబు తోడ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న రిత్త నేల
వంధ్యమగుగాక తా ఫలవంతమగునె ?

తే. మేలు రెండు లోకంబుల మేలు తెచ్చుఁ
గీడు సేసినఁ దప్పదు కీడ యగుట
గాన పురుషవర్తనమున కానుకూల్య
శీలమగు దైవ మది ఫలసిద్ధిఁ జేయు.

శ్లో. యోయో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్యతస్యాచలాంశ్రద్ధాం, తామేవవిదధామహమ్.

గీత. అధ్యాయం 7 శ్లో. 21

శ్లో. యేఽప్యన్యదేవతా భక్తా, యజంతే శ్రద్ధయాఽన్వితా
తేఽపి మామేవ కౌంతేయ, యజంత్య విధిపూర్వకమ్.

గీత. అధ్యాయం 9 శ్లో. 23

ఈ గ్రంథమం దేమైన తప్పు లుండిన తెలిపినచో సవరణజేసికొనగల వాడనని మనవి.

ఇట్లు
గ్రంథకర్త

ఓం

శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

# దేవుని తత్త్వము: జీవుని ధర్మతత్త్వము

ప్రశ్న : దేవు డనగా నెవరు ?

సమా : సృష్టికర్తయే దేవుడు.

ప్రశ్న : సృష్టి యన నేమి ?

సమా : బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు; సూర్య, చంద్ర, ఇంద్ర, వరుణ, అగ్ని, మొదలగు దేవతలు, దేవతలు నివసించే లోకములు ఏడును.

మానవాది జీవులు, అధోలోకములు ఏడును ( చరాచరములన్నియు ) భగవంతుని సృష్టి యనబడును.

ప్రశ్న : దేవుడు సృష్టి నెందుకు చేసెను ?

సమా : వినోదము కొఱకు.

ప్రశ్న : దేవుని పేరేది ?

సమా : "నేను అనునది దేవునియొక్క నిజమైన పేరు" అని రమణమహర్షి చెప్పెను.

" తస్య వాచకః ప్రణవః ". దేవుని పేరు ఓమ్ అని పతంజలి మహర్షి చెప్పెను.

శ్లో. తదేవ త్వరం బ్రహ్మా। సత్యేశ్వర శివాదిభిః
శూన్యైకపరమాత్మాది। నామభిః పరిగీయతే॥

తా. ఆ దేవుడు పరబ్రహ్మమని, సత్యమని, శివుడని, విష్ణువని శూన్యమని, పరమాత్మయని పలుపేరులతో పిలువబడుచున్నాడు. ( వాసిష్ఠం )

శ్లో. సుషుమ్నా శూన్యపదవీ, బ్రహ్మరంధ్రం మహాపథః
శ్మశానం శాంభవీ మధ్యమార్గశ్చే త్యేక వాచకాః॥

తా. ఆ దేవునకు, సుషుమ్నయని. శూన్యపదమని, బ్రహ్మరంధ్రమని, మహాపథమని, శ్మశానమని, శాంభవీయని, మధ్యమార్గమనియు పేరులు గలవు. ( హఠయోగప్రదీపిక )

ప్రశ్న : భగవంతుడెందుకు అవతారములెత్తెను ?

సమాధానము :

శ్లో. నిర్గుణంచేంద్రియాతీతం, నిరాకారం నిరంజనమ్
స్వభక్త రక్షణార్థాయ, జాయతే హి యుగేయుగే॥

తా. భగవంతుడు గుణములు లేనివాడు, ఇంద్రియములు లేనివాడు, నిరాకారుడు, నిరంజనుడు నైనప్పటికిని తన భక్తులను కాపాడుకొనుటకుగాను అపుడపుడు అవతరించుచుండును.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగేయుగే॥

తా. దేవుడు సజ్జనులను రక్షించుట కొరకును, దుష్టులను శిక్షించుటకును, ధర్మమును చెడనీయక నిలబెట్టుట

కొరకును ఆయాకాలములందు అవతరించుచుండును.

(గీత. 4. అధ్యాయం)

ప్రశ్న : సగుణ దేవతలలో ప్రధాన దేవత లెవరు?

సమా : బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, దేవి.

ప్రశ్న : వీరిలో ప్రధాను లెవరు?

సమా : బ్రహ్మకల్పములో బ్రహ్మదేవుడే ప్రధాని. విష్ణుకల్పములో విష్ణువే ప్రధాని. శివకల్పములో ఈశ్వరుడే ప్రధాని. దేవీకల్పములో దేవియే ప్రధానురా లనబడును. ఇపుడు గడుచుచున్న కాలము శ్వేతవరాహకల్పము. అందువలననే ముఖ్యముగా విష్ణువే అనేక అవతారము లెత్తి తన సృష్టిని పోషించుకొనుచున్నాడు.

ప్రశ్న : బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడ లోకోద్ధారణ కొరకు అవతరించుచుందురా?

సమా : ఆ. అవతరించుచుందురు.

ప్రశ్న : వారి దివ్యనామములను తెలిపెదరా?

సమా : విష్ణువు దత్తాత్రేయులుగాను, శివుడు దుర్వాసుడుగాను, బ్రహ్మ చంద్రుడుగాను అవతరించిరి. (వీరు అనసూయ పుత్రులు) ఇట్లే, విష్ణువు పద్మపాదాచార్యులుగాను, శివుడు శంకరాచార్యులుగాను, బ్రహ్మ సురేశ్వరాచార్యులుగాను అవతరించిరి. ఇట్లే, విష్ణువు జ్ఞానదేవుడుగను, శివుడు నివృత్తిదేవుడుగను, బ్రహ్మ సోపానదేవుడుగను అవతరించిరి. ఇట్లే, విష్ణువు బ్రహ్మంగారుగను, శివుడు సిద్ధయ్యగారుగను, బ్రహ్మ అన్నాజీగాను అవతరించిరి.

విష్ణువు హంసగా, (సనకాదులకు బోధించుటకు) యజ్ఞుడుగా, కపిలుడుగా, నరనారాయణులుగా, ఋషభుడుగా, పృథుచక్రవర్తిగా, ధన్వంతరిగా, మోహినిగా, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామనుడుగాను, పరశురామ, దశరథరామ, శ్రీకృష్ణ, శ్రీ బుద్ధులుగాను అవతారము లెత్తెను.

హనుమంతుడు, హుబ్బళి, సిద్ధారూఢస్వాములవారు, సాయిబాబాగారు, అప్పయ్యదీక్షితులు, వివేకానంద స్వామియు శివాంశసంభూతులు.

శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు, శ్రీ రామకృష్ణ పరమహంసయు, విష్ణ్వంశ సంభూతులు.

మహమ్మదు, ఏసు, కబీరుదాసు, తులసీదాసు, నామ దేవుడు, జయదేవుడు, శ్రీ రమణమహర్షి, అరవిందయోగి, శ్రీ మలయాళసద్గురు స్వాములవారు, శ్రీ శివానంద స్వాములవారు, గాంధీ మొదలగు మహాత్ములు భగవంతుని కళావతారు లనబడుదురు.

రామానుజాచార్యులు ఆదిశేషాంశ సంభూతులనియు, మధ్వాచార్యులవారు వాయుదేవాంశ సంభూతులనియు చెప్పుట కలదు.

వసిష్ఠ, వ్యాసాది ఋషులు కూడ దైవాంశ సంభూతులే గదా.

ప్రశ్న : ఏ దేవతను భజించిన మోక్షము కలుగును?

సమా : ఏ దేవతను భజించినను మోక్షము గలుగు ననుటలో సందేహము లేదు.

విష్ణువు హంసగా, (సనకాదులకు బోధించుటకు) యజ్ఞుడుగా, కపిలుడుగా, నరనారాయణులుగా, ఋషభుడుగా, పృథుచక్రవర్తిగా, ధన్వంతరిగా, మోహినిగా, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామనుడుగాను, పరశురామ, దశరథరామ, శ్రీకృష్ణ, శ్రీ బుద్ధులుగాను అవతారము లెత్తెను.

హనుమంతుడు, హుబ్బళి, సిద్ధారూఢస్వాములవారు, సాయిబాబాగారు, అప్పయ్యదీక్షితులు, వివేకానంద స్వామియు శివాంశసంభూతులు.

శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు, శ్రీ రామకృష్ణ పరమహంసయు, విష్ణ్వంశ సంభూతులు.

మహమ్మదు, ఏసు, కబీరుదాసు, తులసీదాసు, నామ దేవుడు, జయదేవుడు, శ్రీ రమణమహర్షి, అరవిందయోగి, శ్రీ మలయాళసద్గురు స్వాములవారు, శ్రీ శివానంద స్వాములవారు, గాంధీ మొదలగు మహాత్ములు భగవంతుని కళావతారు లనబడుదురు.

రామానుజాచార్యులు ఆదిశేషాంశ సంభూతులనియు, మధ్వాచార్యులవారు వాయుదేవాంశ సంభూతులనియు చెప్పుట కలదు.

వసిష్ఠ, వ్యాసాది ఋషులు కూడ దైవాంశ సంభూతులే గదా.

ప్రశ్న : ఏ దేవతను భజించిన మోక్షము కలుగును?

సమా : ఏ దేవతను భజించినను మోక్షము గలుగు ననుటలో సందేహము లేదు.

సమా : భగవంతుడు మానవాకారముగా నవతరించుటయే గాక, విగ్రహములరూపముగా కూడ అవతరించి భక్తులచే పూజింపబడి మోక్షము నిచ్చుచున్నాడు, యిచ్చెను.

త్రేతాయుగములో శ్రీరామచంద్రుడు ఒరిస్సారాష్ట్రములో గుప్తేశ్వరలింగమును పూజించెను. దక్షిణదేశమున హంపి విజయనగరమందు సుగ్రీవుడు పూజించిన శివలింగమును అర్చించెను. రామేశ్వరమందు శివలింగమును ప్రతిష్ఠించి పూజించెను.

కాశీ విశ్వనాథేశ్వరలింగము, అరుణాచలేశ్వరలింగము, భద్రాద్రిరామ విగ్రహములును, శ్రీ పాండురంగ విగ్రహమును మానవులు నిర్మించినవి కావుగదా. మన దేశములో స్వయంగా ఉద్భవించిన దేవతావిగ్రహములు అనేక పుణ్యక్షేత్రములలో కలవు. విగ్రహారాధనద్వారా దేవుని సాక్షాత్కారము చేసికొనినవారు, మోక్షము నొందినవారును అనేకులు కలరు. కనుక, విగ్రహారాధన తప్పు కాదు.

మన దేశములో దేవతలు, ఋషులు, పరమ భక్తులున్ను ప్రతిష్ఠించిన దేవతావిగ్రహములు అనేకము కలవు.

ప్రశ్న : సగుణారాధన వలన లాభమేమి కలుగును? నిర్గుణారాధనవలన ప్రయోజనమేమి కలుగును?

సమా : సగుణారాధన వలన పాపదోషములు నశించును. ఆత్మబలము కలుగును. శరీరము, వాక్కు, మనస్సును శుద్ధములై క్షేమముగా నుండును.

విష్ణువు హంసగా, (సనకాదులకు బోధించుటకు) యజ్ఞుడుగా, కపిలుడుగా, నరనారాయణులుగా, ఋషభుడుగా, పృథుచక్రవర్తిగా, ధన్వంతరిగా, మోహినిగా, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామనుడుగాను, పరశురామ, దశరథరామ, శ్రీకృష్ణ, శ్రీ బుద్ధులుగాను అవతారము లెత్తెను.

హనుమంతుడు, హుబ్బళి, సిద్ధారూఢస్వాములవారు, సాయిబాబాగారు, అప్పయ్యదీక్షితులు, వివేకానంద స్వామియు శివాంశసంభూతులు.

శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు, శ్రీ రామకృష్ణ పరమహంసయు, విష్ణ్వంశ సంభూతులు.

మహమ్మదు, ఏసు, కబీరుదాసు, తులసీదాసు, నామ దేవుడు, జయదేవుడు, శ్రీ రమణమహర్షి, అరవిందయోగి, శ్రీ మలయాళసద్గురు స్వాములవారు, శ్రీ శివానంద స్వాములవారు, గాంధీ మొదలగు మహాత్ములు భగవంతుని కళావతారు లనబడుదురు.

రామానుజాచార్యులు ఆదిశేషాంశ సంభూతులనియు, మధ్వాచార్యులవారు వాయుదేవాంశ సంభూతులనియు చెప్పట కలదు.

వసిష్ఠ, వ్యాసాది ఋషులు కూడ దైవాంశ సంభూతులే గదా.

ప్రశ్న : ఏ దేవతను భజించిన మోక్షము కలుగును ?

సమా : ఏ దేవతను భజించినను మోక్షము గలుగు ననుటలో సందేహము లేదు.

చరాచరజగత్తు యనబడును. కనబడని రూపము పరబ్రహ్మ మనబడును.

శ్లో. నారాయణస్య ద్వేరూపే, చల మచల మేవ చ
చలం సన్న్యాసినో రూప మచలం ప్రతిమాదికమ్ ॥

తా. దేవునికి చలనముగల రూపము, చలనములేని రూపము అని రెండు రూపములు చెప్పబడుచుండును. చలనముగల రూపము సన్న్యాసి (అనగా సద్గురు) రూప మగును. విగ్రహము అచలరూపమగును.

శ్లో. హరిర్దేహద్వయేన్నాథ, మహీమవతరిష్యతి
వసుదేవ సుతస్త్వేకో వాసుదేవ ఇతిశ్రుతః
దేహోఽథవిష్యతిహ రేర్ద్వితీయః పాండునందనః ॥

తా. శ్రీహరి ఈ లోకమందు రెండు దేహములుగా నవతరించెను. మొదటి దేహము వసుదేవుని కుమారుడగు వాసుదేవుడు (అనగా శ్రీకృష్ణభగవానుడు) రెండవ దేహము పాండురాజు కుమారుడగు అర్జునుడు.

ప్రశ్న: అందరకును దేవునిపై పూర్ణనమ్మకముండునా?

సమా: ఉండదు. సత్త్వగుణస్థులకు మాత్రము.

క. హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సంశయము పనిలే దా
హరిమయముగాని ద్రవ్యము
పరమాణువులేదు వంశపావన వించే ॥

(రజోగుణస్థులకు)

క. కలడందురు దీనులయెడ
 గలడందురు పరమయోగి గణములపాలన్
 గలడందు రన్ని దిశలను
 గలడు కలండనెడివాడు గలడో లేడో ॥
 (తమోగుణస్థులు)

ఆ॥ తనకు లేనినాడు దైవము దూరును
 తనకు గలిగెనేని దైవమేల
 తనకు దైవమునకు దగులాటమే శాంతి
 విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఈ పైజెప్పిన విధముగా సత్త్వగుణస్థులకు దేవుని యందు పూర్ణనమ్మక ముండుననియు, రజోగుణస్థులకు దేవుడున్నాడో, లేడో యను సంశయ ముండుననియు, తమోగుణస్థులు ఒకప్పుడు దేవుడు లేడని దూషింతురు. ఒకప్పుడు కష్టములు వచ్చినప్పుడే దేవుని భజింతురు అని యును గ్రహించవలెను.

ప్రశ్న : దేవు డెవరికి స్వాధీను డగును ?

సమా : "భక్త్యాత్వనన్యయా శక్యః" అని గీతలో చెప్పినట్లు భగవంతునిపై భక్తిగలవారై పూజ, సేవ, నమస్కారములు, కీర్తన, స్మరణ, జపము, ధ్యానములు చేయుచుండువారికి దేవుడు స్వాధీనుడగును.

శ్లో. దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతమ్
 తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణో మమ
 దైవతమ్ ॥

తా. ఈ జగమంతా దేవుని అధీనమైయున్నది. ఆ దేవుడు మంత్రమునకు కట్టుబడి యున్నాడు. ఆ భగవన్నామ మంత్రము పరమభక్తుల స్వాధీనములో నుండును. ఆ పరమ భక్తులే నాకు పూజనీయులు.

ప్రశ్న : దేవుడొక్కడా, అనేకు లున్నారా ?

సమా : మానసాదీంద్రియములను, గుణములను నిగ్రహించి నిరాకార పరమాత్మ చైతన్యమును ధ్యానించు చుండు వారికి (అనేకత్వములో ఏకత్వమును గుర్తించి చూచుచుండువారికి) దేవుడొక్కడే. లోక (సంసార) భ్రాంతులతో నుండువారికి అనేక విష్ణ్వవతారములు, అనేక శివావతారములు దేవాలయాదులలో పూజింపబడుచున్నట్లు, స్తుతింపబడుచుండునట్లును తోచుచుండును. అనగా జ్ఞానులకు దేవుడు ఒక్కడుగాను, భక్తులకు అనేకులుగాను అనుభవమై యుండును. దేవుడు ఏకు డనుట నిజమే. అనేకులుగా నున్నా డనుటయు నిజమే.

ఒక్క బంగారము అనేక నగలుగా నున్నదనుట నిజమేగదా. ఇట్లే ఒక్క మన్ను అనేక పాత్రలుగా నున్న దనుట నిజమేగదా. ఇట్లే నిర్గుణోపాసకులకు ఒక్కడుగాను, సగుణోపాసకులకు అనేకులుగాను దేవుడు తోచుచుండును.

శ్లో. ఆదిసర్గే మహావిష్ణు స్స్వప్రకాశో జగన్మయః
గుణభేద మధిష్ఠాయ మూర్తిత్రయ భవాత్మవాన్॥

శ్లో. హిరణ్యగర్భో రజసా, తమసా శంకర స్స్వయమ్
సత్త్వేన సర్వగో విష్ణు స్సర్వాత్మ త్వే మహేశ్వరః॥

తా. సృష్టియొక్క మొదటియందు స్వప్రకాశము గను, జగద్రూపముగ నుండు నారాయణుడు, సత్త్వ రజస్తమము లనెడి గుణభేదముల చేత విష్ణు, బ్రహ్మ, రుద్రులను మూడు రూపములను ధరించినాడు.

ఆ భగవంతుడు రజోగుణముచే బ్రహ్మగను, తమోగుణముచే శివుడుగను, సత్త్వ గుణముచే విష్ణువుగ నున్నాడు. ఆ విష్ణువే సర్వాత్మగా నుండుటవలన మహేశ్వరుడనబడెను.

శ్లో. అగ్నిర్దేవో ద్విజాతీనాం, మునీనాం హృది దైవతమ్
ప్రతిమా స్వల్పబుద్ధీనాం, సర్వత్ర సమదర్శనామ్ ॥

తా. బ్రాహ్మణులకు అగ్నియే దేవుడు. మునులకు (ధ్యానము చేయువారికి) హృదయమే దేవుడు. అల్పబుద్ధి గలవారికి (శివ, రామ, కృష్ణ, దేవీ) విగ్రహమే దేవుడు. సమదృష్టిగల మహాత్ములు అన్నిచోట్ల దేవునిగాంచు శక్తి గలిగియుందురు. కనుక సర్వమున్ను దైవ స్వరూపమే యగును.

మూలవస్తువగు దేవుని—

పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞులు, సార్వలౌకికజ్ఞానమను చున్నారు.

ఉపనిషత్తులు హిరణ్యగర్భ డనియు, ప్రాణ మనియు వచించెను.

బౌద్ధులు ధర్మకాయ మనియు, శూన్య మనియు జెప్పిరి.

మహమ్మదీయులు అల్లా యనిరి.

పురాణములు బ్రహ్మము, పరమాత్మ, ఈశ్వరుడు, పురుషోత్తముడు, భగవానుడు సత్పదార్థము అని పలికినవి.

ప్రకృతివాదులు చెప్పనలవికాని మూలము కలదని మౌనము వహించిరి.

క్రైస్తవులు పరలోకపిత యందురు.

ప్రశ్న : భక్తులు భగవంతుని ఏ యే కోరికల నెరవేర్చమని ప్రార్థింపవచ్చును ?

సమా : "ఓ భగవంతుడా, నావలన ఇతరులకు బాధ కలుగకుండునట్లు నన్ను నడిపించుము. ఓ సర్వేశ్వరా, నాలోగల ఇతరుల తప్పులను వెదకెడి దుర్గుణమును నశింప జేయుము. ఓ జగద్రక్షకా, నాలోగల కామ క్రోధ దురాశలను పోగొట్టుము. ఓ పరమాత్మా, నాలో పాతుకొని గట్టిగాయున్న నా వారు, నా వస్తువులు అను మమకారమును నిర్మూలింపుము. ఓ మోక్షప్రదాయకా, నాలోగల భేదభావములను, అహంకారమును పారద్రోలుము" అని వేడుకొనవచ్చును.

ప్రశ్న: లోకములో ఎన్ని తరగతుల మానవు లుందురు?

సమా : (1) దేవుని పొందినవారు (2) దేవుని తత్త్వము నెరిగినవారు (3) దేవుని నమ్మి భజించుచుండువారు (4) దేవుడు కలడో, లేడో యను సంశయము గలవారు (5) దేవుడు లేడని సత్య ధర్మ నీతి వైరాగ్యములతో వర్తించుచుండువారు (6) దేవుని చూచినవారు (7) దేవుని దూషించుచు పాపకార్యముల జేయుచుండువారును లోకములో నుందురు.

ప్రశ్న : సర్వమున్ను దైవ స్వరూపమైతే మానవులు ఎక్కడనో దేవుడున్నాడని తీర్థయాత్రలు, దేవతల దర్శనములు, పూజలు, నమస్కారములు, భజనలున్ను చేయు చుందు రదేల ?

సమా : సర్వమున్ను దేవుని స్వరూపమైనప్పటికిన్ని, దేవునిగా చూచు శక్తి కలుగనందున తీర్థయాత్రాది సత్కర్మలు చేయుచుండవలెనని పెద్దలు నిర్ణయించిరి,

మొదట దేవుని విగ్రహమును దైవస్వరూపమని భావించుచుండవలెను. రెండవసారి తల్లి దండ్రులను దైవ స్వరూపులని భావించవలెను. మూడవసారి సద్గురువులను, సాధువులను, భక్తులను దైవస్వరూపులనుగా భావించ వలెను. నాలుగవసారి సద్గ్రంథములోని కర్మ, ధర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయములను భగవత్స్వరూపములని సంభావించుచుండవలెను. ఐదవసారి గృహములోనివారిని, గ్రామములోనివారిని దేవుని స్వరూపులుగా చూచుచుండ వలెను. ఆరవసారి అన్ని జీవులను, అన్ని వృక్షములను, పర్వతములను, జలములను, అగ్నిని, వాయువును, పృథివిని, భగవత్స్వరూపములని భావించుచుండవలెను. ఏడవసారి తన ఆత్మ, శత్రువులు, చెడు కర్మలు, చెడ్డమాటలు, రోగులు, చెడుపదార్థములు, సుఖ దుఃఖములున్ను దైవ స్వరూపములుగా నిశ్చయించుకొనవలెను. ఈవిధముగా సర్వమున్ను దైవస్వరూపమని నిశ్చయించుకొని అభేదముగా గాంచుచుండుటయే జ్ఞానము.

ప్రశ్న : నాలో దేవుడేడీ ?

సమా : శ్లో. ఏన శబ్దం రసం రూపం, గంధం జానాసి రాఘవ
తమాత్మానం పరంబ్రహ్మ, జానీహి పరమేశ్వరమ్ ॥

తా. చెవుల ద్వారా స్తుతి నిందాది శబ్దములను ఏ తెలివి నీలో తెలిసికొనుచున్నదో, నాలుక ద్వారా వివిధ రుచులను ఏ తెలివి నీలో తెలిసికొనుచున్నదో, ముక్కు ద్వారా వివిధ వాసనలను ఏ తెలివి తెలిసికొనుచున్నదో, నేత్రముల ద్వారా ఏ తెలివి వివిధ రూపములను తెలిసికొనుచున్నదో ఆ తెలివియే నీ నిజస్వరూపము. అదే దైవ స్వరూపము. అదే పరబ్రహ్మము.

ప్రశ్న : నేను దేనిని దృష్టిలో నుంచుకొనినచో సుఖముగా నుండగల్గుదును ?

సమా : సర్వము పరబ్రహ్మస్వరూపమేయను విషయమును దృష్టిలోనుంచుకొనినచో నీవు సుఖముగా జీవితమును గడుపగలుగుదువు.

ప్రశ్న : మానవుల దృష్టిలో నేవి విశేషముగానుండును ?

సమా : సుఖము, దుఃఖము, ధనము, కీర్తి, భోగములున్న విశేషముగా దృష్టిలో నుండును.

ప్రశ్న : నాలో జీవు డెవడు ?

సమా : "మనయేవ జీవః" అన్నట్లు నీలో చలన శక్తియగు మనస్సే జీవుడు. మరియు, సుఖదుఃఖములను అనుభవించుచుండునట్టి చైతన్యమే జీవుడు.

ప్రశ్న : జీవునకు సుఖదుఃఖములు కలుగుటకు కారణము లెవ్వి ?

సమా : కర్మేంద్రియ వృత్తులపై, జ్ఞానేంద్రియ విషయములపైని, యిష్టానిష్టములు (రాగద్వేషములు) కలిగియుండుటవలన సుఖ దుఃఖములు కలుగుచున్నవి.

ప్రశ్న : జీవునికి గల సుఖ దుఃఖాది ద్వంద్వములెట్లు నివర్తించును ?

సమా : రాగద్వేషములను వదలి ఇంద్రియములకు అధిష్ఠానముగా (సాక్షిగా) వున్న పరమాత్మను నిరంతర మును ధ్యానించు చున్నయెడల దేహాభిమానము నశించి, సుఖ దుఃఖములు నివర్తించును.

ప్రశ్న : నాలో దైవదృష్టి యేది ? జీవదృష్టి యేది ?

సమా : నీలో నిశ్చలదృష్టి దైవదృష్టి యనబడును, చలనదృష్టి జీవదృష్టి యనబడును. ఎట్లన, పామును చూచునది దైవదృష్టి, పామునకు భయకంపాదుల జెందునది జీవదృష్టి. ఇట్లే, నిందావాక్యములను తెలిసికొనునది దైవ దృష్టి, నిందకు బాధపడునది జీవదృష్టి. ఇట్లే, లాభనష్టము లను గుర్తించునది దైవదృష్టి. లాభనష్టములకు సంతోష వ్యసనముల జెందునది జీవదృష్టి. ఇట్లే, స్త్రీ పురుషులను తెలిసికొనునది దైవదృష్టి, వీరు నావారు, వారు పరాయి వారు యని భేదించునది జీవదృష్టి. ఇట్లే, ధనమును, భూమిని తెలిసికొనునది దైవదృష్టి, ఈ ధనము ఈ భూమియు నావి, ఆ ధనము ఆ భూమియు నావికావని నిర్ణయించునది జీవ దృష్టి. ఇట్లే, అవయవములతో నీ దేహమును చూచునది, తెలిసికొనునదియు దైవదృష్టి, నీ దేహమునకు నిందలు, దెబ్బలు, రోగములు, వస్త్రహీనము, ఆహారముయొక్క

కొరత, నివసించుటకు స్థలము లేకపోవుటయు సంభవించి నపుడు బాధలు పడునది జీవదృష్టి యనబడును. ఈవిధముగా అన్ని వ్యవహారములలోను గుర్తించవలెను.

ప్రశ్న : దేవుని కృపవలన మోక్షము కలుగునా? జీవుని (మానవుని) ప్రయత్నమువలన మోక్షము లభించునా?

సమా : భగవంతుడు మోక్షస్వరూపుడు, మోక్ష ప్రదాతయు నగును. అయినప్పటికిని మానవుడు భగవంతుని నమ్మి నిరంతరమును భజించనిదే మోక్షము లభించదు.

సేద్యము (వ్యవసాయము) చేయనిదే భూదేవి ధాన్యము నివ్వదు. సేవచేయనిదే ప్రభువు ధనము నివ్వడు. ధనము నివ్వనిదే వర్తకుడు వస్తువుల నివ్వడు. ఇట్లే, దేవునికి ఇష్టము గలిగించనిదే, మన కష్టములను దొలగించడు.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం, యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం
వహామ్యహమ్ ॥

ఈ శ్లోకములో, భగవంతుడు ముందుగా "నాసేవ నీవు చేసినచో, తరువాత నీ సేవ నేను చేసెద" నని జీవునితో చెప్పినాడు. (గీత, 9, అధ్యాయం.)

శ్లో. సర్వ ధర్మా న్పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మాశుచః॥

ఈ శ్లోకములో, భగవంతుడు "పూర్తిగా నీ జీవితమును నాకు సమర్పింపుము, నీకు నేను మోక్షము కలిగించెద" నని జీవునితో చెప్పినాడు.

శ్లో. న దైవం న చ కర్మాణి, న ధనాని న బాంధవాః
శరణం భవ భీతానాం, స్వప్రయత్నా దృతే నృణామ్॥

తా. సంసారమువలన భయపడిన మనుజులకు స్వప్రయత్నమే సంరక్షకమగును గాని, అది వినా, దేవుడు గాని, కర్మలుగాని, ధనముగాని, బంధువులుగాని రక్షకులు గారు. (జ్ఞానవాసిష్ఠం)

ఈ పై శ్లోకములచే జీవుని స్వప్రయత్నము లేనిదే దేవుడు రక్షించడని, మోక్షము గలుగదనియు తెలియు చున్నది గదా.

జీవుడు నదివంటి వాడు. దేవుడు సముద్రమువంటి వాడు. నది సముద్రములోనికి పోయి తన నామ రూపములను గోల్పోయి సముద్ర మగుచున్నదిగదా! ఇట్లే జీవుడుకూడ లోకభ్రాంతులను త్యజించి దేవుని నమ్మి భజించుచు తన వ్యక్తిత్వమును గోల్పోయి అఖండ పరబ్రహ్మానందస్వరూపు డుగా స్థిరపడుచున్నాడు.

లోకమును నమ్మినవాడు నీచు డగును. దేవుని నమ్మిన వాడు దేవు డగును.

నారదుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు, మార్కండే యుడు, గజేంద్రుడు, ద్రౌపది, సక్కుబాయి, మీరాబాయి, జనాబాయి, తరిగొండ వెంకమాంబ, నందనారు మొదలగు అనేకమంది భగవంతుని నమ్మి భజించి, అక్షయ కీర్తిని, శాశ్వతానందమును పొందిరి గదా!

ప్రశ్న : కర్మలు సక్రమముగా జరుగుటకును, విపరీత ముగా జరుగుటకును కారణభూతుడు దేవుడా? జీవుడా?

సమా : కర్మ ఫలదాత దేవుడు. జీవుడు చేసిన పుణ్యమునకు సుఖమును, పాపమునకు దుఃఖమును భగవంతుడు కలిగించును.

తే. కార్యఫలములయెడ దాన కర్త ననుట
కడు నెరుంగమి జుమ్మీ తా గర్తయేని
తగిలి తనదైన కార్యజాతంబు నెల్ల
జెడక ఫలియించునట్లుగా జేయరాదె.

గీ. కాగల పనులెల్ల కాకెట్లు పోవును
కాని పనులు భువిని కానె కావు
మహిమ వేరె యుండ మనతోడ నున్నదా ?
విశ్వదాభిరామ వినుర వేమ.

జీవుడు పూర్వజన్మమున గాని, ఈ జన్మమున గాని చేసికొనిన కర్మల ననుసరించి సుఖదుఃఖాది ఫలితములు పొందుచుండును.

నీవు ఈదినమున గాని, రేపటిదినమున గాని, మరు క్షణమునగాని ఏమి చేయుదువో, ఏమి పొందెదవో తెలియకుందువుగదా! అది దేవుని నిర్ణయము ప్రకారము జరుగుచుండును.

దశరథ మహారాజు శ్రీరామునికి పట్టాభిషేకము చేయ తలపెట్టినపుడు అది దైవ నిర్ణయము ప్రకారము ఆగిపోలేదా!

నీజీవితములో అనుకున్న పనులు కాకపోవుట, ప్రారంభించిన పనులు జరుగకుండుటయు అనుభవమునొందియుంటివి గదా!

ప్రశ్న: 'దేవుడేది చేసినను మనమేలుకొరకే', నని పెద్దలు చెప్పుచుండుట వినియున్నాను. అది నిజమేనా?

సమా: భగవంతుడు భక్తుల పాపములను పోగొట్టుటకు, భక్తులను అన్నివేళలను కాపాడుటకు, దుష్టులను సంహరించుటకు, ధర్మమును కాపాడుట కొఱకును ఎల్లప్పుడును పాటుపడుచుండును.

శరీరమునకు వ్యాధులు వచ్చినపుడు శరీరములో గల పాపము పోవుటకొరకే దేవుడు వ్యాధులను కలిగించెనని తలంచవలెను.

నిందలు వచ్చినపుడు, భయము కలిగినపుడు, దుఃఖములు వచ్చినపుడును మన హృదయములో గల పాపదోషములు, దుర్గుణములున్ను నశించుటకు మాత్రమే భగవంతుడు దుఃఖములను తెచ్చిపెట్టినాడని నిశ్చయించుకొనవలెను.

ఐశ్వర్యము గలిగినపుడు దానధర్మాది సత్కార్మలను చేయుచు సుకృతము నార్జించుకొనుటకును, సత్కీర్తిని పొందుటకును భగవంతుడు ఐశ్వర్యము నిచ్చినాడని గ్రహించవలెను.

దరిద్రము వచ్చినపుడు, బంధుమిత్రాదులు చనిపోయినపుడును నిశ్చింతగా, నిర్భయముగా భగవంతుని ధ్యానించుటకును, పెద్దలదగ్గర నివసించి సేవచేయుచు వేదాంతశాస్త్ర ధర్మములను తెలిసికొనుటకును అనుకూలముగా నుండునని దేవుడు దరిద్రమును, బంధువియోగమును కలిగించినాడని గ్రహించవలెను.

నారదుడు తల్లి చనిపోయినపుడు స్వేచ్ఛగా భగవన్నామసంకీర్తన చేసికొనుచు తిరుగుటకు అనుకూలమేర్పడిన దని సంతోషమొందెను.

విఠోబా తల్లిదండ్రులు పోయినందుకు సంతోషించెను.

తుకారామ్ భార్య పోయినతరువాత, 'ఓ పాండురంగా యిక నీదీ నాదీ రాజ్యము' అని సంతసించెను.

తరిగొండ వేంకమాంబ భర్త చనిపోయిన తరువాత స్వేచ్ఛగా శ్రీ వేంకటేశ్వరుని ధ్యానించుచు పరబ్రహ్మానందము నొందెను.

మీరాబాయి భర్త చనిపోయినందుకు చింతపడక గృహమునుకూడా వదలి, సాధుసాంగత్యములో, ఏకాంతస్థలములలోను నివసించుచు శ్రీకృష్ణభగవానుని ధ్యానించుచు చివరకు శ్రీకృష్ణునియం దైక్యమయ్యెను.

ఒకనాడు శ్రీకృష్ణార్జునులు మారువేషము దాల్చి ఒక ధనవంతుని ఇంటికి వెళ్లగా అతడు వీరినేమియు గౌరవించలేదు. అపుడు శ్రీకృష్ణభగవానుడు 'నీయైశ్వర్యము వృద్ధి నొందునుగాక' యని ఆశీర్వదించి ప్రయాణమై పోవుచు, ఒక గోవువలన లభించే ఆర్జనతో జీవించుచున్న దరిద్రుని ఇంటికి వెళ్లగా అతడు శ్రీకృష్ణార్జునుల పాదపద్మములను భక్తితో కడిగి శిరస్సున జల్లుకొని, వారిని ఆసనముపై కూర్చుండబెట్టి గోవుపాలను తీసికొనివచ్చి తృప్తికరముగా పానముచేయించెను. అపుడు శ్రీకృష్ణభగవానుడు మిక్కిలిసంతసించి 'నీగోవు చచ్చునుగాక'యని శపించి అచటనుండి ప్రయాణమై వెళ్లిరి. అర్జునునకు సంశయము గలిగి, 'కృష్ణా, మనలను గౌరవించని

ధనవంతుని ఐశ్వర్యము వృద్ధినొందు గాక యని ఆశీర్వదించి భక్తితో గౌరవించిన దరిద్రునికి శాపమిచ్చుట అన్యాయముగాదా' యని అడిగెను. అపుడు భగవానుడు నవ్వుచు 'నేను చేసిన పనులలో అన్యాయ మేమియు లేదు. పరమ లోభియగు ఆ ధనవంతుని పాపము పెరిగి తొందరగా నరకము నొందుటకు గాను ఆశీర్వదించితిని. దరిద్రుడు తొందరగా మోక్షమునొందుటకు గాను దైవస్మరణకు ప్రతిబంధకముగానున్న గోవు చనిపోవుగాక యని శపించితి' నని చెప్పెను.

ప్రశ్న: స్వామీ! నాకుగాని, ఇతరులకుగాని రోగాది బాధలు (ఆపదలు) వచ్చినపుడు భగవంతుని ప్రార్థించిన యెడల రోగాది యాపదలు నివారణమగునా?

సమా: భగవంతునిపై దృష్టి నుంచుకొని విశ్వాసముతో భగవంతుని ప్రార్థించుటచేత, ధ్యానించుట, జపించుట స్మరించుటచేత తప్పక దేవుని కృప గలిగి ఆపదలు నశించును.

ప్రశ్న: ప్రహ్లాదుడు, నారదుడు, అంబరీషుడు, గజేంద్రుడు, ద్రౌపది, సక్కుబాయి, మీరాబాయి, మొదలగు భక్తులు ప్రార్థనచేయగానే భగవంతుడు ప్రత్యక్షమై ఆపదలను పోగొట్టి కాపాడినాడుగదా! నే నెంత కాలము ప్రార్థనాదుల జేసినను భగవంతుడు నా బాధలను పోగొట్ట డెందువలన?

సమా: పూర్వము చేయబడిన పాపదోషములు అడ్డు వున్నంతవరకును కోరికలు నెరవేరవు. అడ్డు తొలగిన వెంటనే కోరికలు నెరవేరును.

పితృఋణము, దేవఋణము, గురుఋణములు నున్నంత వరకును ఏరూపముగనైనను బాధలు కలుగుచునే యుండును.

దేవుడు నీకు ఋణపడియుండునట్లు నీవు దేవునికి సేవ, ప్రార్థన, స్మరణ, ధ్యానములను చేసియున్నచో ఆపత్కాలములో నీవు ప్రార్థనచేయగానే రక్షించును. నీవే దేవునికి ఋణపడి యుండినచో నీవెంతకాలము మొర బెట్టుకొనినను (ప్రార్థనాదుల జేసినను) దేవుడు నీ కోర్కెను నెరవేర్చడు. ఇదే రహస్యము.

ధనవంతునికి సేవచేసిన సేవకుడు అడుగగానే డబ్బును ధనవంతు డిచ్చును. సేవ చేయనిచో యివ్వడుగదా!

సేవ తక్కువగా చేసి ఎక్కువగా ఫలితమును కోరినను ప్రయోజన ముండదు.

సేవచేయుచు ఫలితమును కోరనివారే ఉత్తములు, సుఖవంతులు, కీర్తివంతులు నగుదురు.

భగవంతుడుకూడ మంచివారిపై దయ జూపును. చెడ్డవారిపై క్రోధము చూపును.

ప్రశ్న : నాకు దైవాత్మానుభవము ఎపుడు గలుగును?

సమా : నీకుగల లోకానుభవములు నశించినపుడే దైవానుభవము గలుగును.

ప్రశ్న : లోకానుభవము లనగా నేమి?

సమా : లోక మనగా ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమియు నగును. లోకానుభవములలో నుండుట

యనగా నీవు చెవులతో ఆకాశగుణములగు ఇష్టానిష్ట శబ్ద ములను వినుచు, రాగద్వేషానుభవములో నుంటున్నావు. ఇట్లే నీవు చర్మముతో చల్లదనమును, వేడిని, మెత్తదనమును, కఠినమును తెలిసికొనుచు ప్రియాప్రియములతో నుంటు న్నావు. ఇట్లే, నీ నేత్రములతో మంచిచెడు రూపములను చూచుచుండుటవలన రాగద్వేషానుభవములలో నుంటు న్నావు. ఇట్లే నీవు నాలుకతో రుచి, అరుచులను తెలిసి కొనుటవలన సంతోష, వ్యసనముల నొందుచున్నావు. ఇట్లే నీవు ముక్కుతో సుగంధ దుర్గంధములను తెలిసికొనుట వలన ప్రియాప్రియానుభవముల నొందుచున్నావు. ఈవిధ ముగా జ్ఞానేంద్రియ విషయములలో, నీమనస్సు రాత్రిం బవళ్లును తిరుగుచుండుటవలన ఆత్మ సుఖము, దైవాను భవము మరుగైనది.

ఇపుడు నీవు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాను భవములను నిగ్రహించి, మరచి, త్యాగముచేసి నీమనస్సును బహిర్ముఖమునకు రానివ్వక, అంతర్ముఖమునందుంచి పరమా త్మను చింతించుచు ధ్యానించుచున్నచో తప్పక నీకు లోకానుభవములు నశించి దైవానుభవము కలుగును. సంశయము లేదు.

## దైవజ్ఞానము

ప్రశ్న: స్వామీ! భగవంతుడు అన్ని స్థలము లందును సమానముగ నిండియుండగా గృహమును వదలి

ఆశ్రమములలోనికి, పెద్దల దగ్గరకు, దేవాలయములలోనికి, నదీతీరములకును వెళ్లియుండెదరేల?

సమా: అంతటను దేవుడు నిండియున్నాడనెడి విషయమును పెద్దలద్వారాగాని, శాస్త్రము ద్వారా గాని తెలిసికొని చెప్పుచున్నావేగాని నీ స్వానుభవముతో నీవు చెప్పుటలేదు. కాన భగవంతుడు అన్ని స్థలములందును నిండియున్నాడని చెప్పుటకును, గృహమును వదలి ఆశ్రమములకు, దేవాలయములకు, తీర్థస్నానములకును వెళ్లువారిని ఆక్షేపించుటకును నీకు అర్హతలేదు.

ప్రశ్న: స్వామీ! భగవంతుడు భక్తులను అన్ని విధములుగాను కాపాడుచుండునని చెప్పుచున్నారుగదా. నేను భగవంతుని నమ్మి భజించుచున్నను నాకు తృప్తికరముగా గృహమును, అన్న వస్త్రాదుల నివ్వక బాధలు పెట్టుచున్నాడేమి? "యోగక్షేమం వహామ్యహమ్" అను మాట ప్రకారము దేవుడు వర్తించుటలేదేమి?

సమా: దేవునిలో తప్పేమియున్న లేదు. నీలోనే తప్పులు కలవు. దేవుని పూర్తిగా నమ్మియుండక నమ్మియుంటినని చెప్పుచున్నావు. నీడలోనుండి ఎండలోనికి, ఎండలోనుండి నీడలోనికిని తిరుగుచున్నవానివలె నీ మనస్సు సంసారములోనుండి భగవంతునిలోనికి, భగవంతునిలోనుండి సంసారములోనికిన్ని తిరుగుచున్నది. నీడను వదలక యున్నచో ఎండబాధ లేనట్లు సర్వదా భగవంతుని నమ్మియున్నచో నీ జీవితము హాయిగా నుండును.

ప్రశ్న: నేను ఎన్ని విశ్వాసములు గలిగియుండవలెను?

సమా : గురువునందు, దేవునియందు, ఆత్మయందును విశ్వాసములు గలిగియుండవలెను. 

ప్రశ్న : ఈ త్రివిధ విశ్వాసము లుండుటవలన లాభము లేమి గలుగును? 

సమా : గురువు నీ దృష్టిని బాహ్యవిషయములపై నుంచక అంతర్ముఖముగా నుంచుకొనుమని బోధించును. కావున గురువిశ్వాసమువలన వైరాగ్యము వృద్ధియగును. దేవుడు నమ్మిన భక్తులను అన్ని విధములుగాను కాపాడుచుండును. గాన దైవవిశ్వాసమువలన కష్టములు వచ్చుననెడి పిరికితనముండదు. ఆత్మ ఆనందస్వరూపమగుటవలన దేహ (లోక) సుఖములపై ప్రీతి నశించుటకుగాను ఆత్మవిశ్వాసము గలిగియుండవలెను. సుఖము బైట లేదు, లోన కలదని ఆత్మ బోధించును. 

విశ్వాసము గలవారు ఆచరించి, అనుభవము నొంది, మోక్షసుఖ మనెడి గమ్యస్థానమును చేరుదురు. చదువు లేక, బోధించువారు లేక, తెలియకను మానవులు చెడుట లేదు. దేవునిపై, ధర్మముపై విశ్వాసము లేక చెడుచున్నారు.

ప్రశ్న : స్వామీ! దేవు డనగా నెవరు?

సమా : మానవులు చేసిన పుణ్యమునకు సుఖమును, పాపమునకు దుఃఖమును యిచ్చువాడే దేవుడు.

ప్రశ్న : దేవుని భజించినందువలన లాభ మేమి గల్గును? 

సమా : మానవులు (భక్తులు) కోరిన కోరికలు నెరవేరుటయే లాభమగును.

ప్రశ్న : కోరికలలో ఏ కోరిక గొప్పది ?

సమా : ధనము, సంతానము, విద్య, ఆరోగ్యము, ఉద్యోగము మొదలగువానిని కోరుటకంటె కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాది గుణములను నశింపజేసి, పరమాత్మ ధ్యానముద్వారా దేహమే నేనను నిశ్చయమును నశింపచేసి, స్వస్వరూపాత్మయొక్క సుదృఢానుభవమును గలుగజేయుమని కోరుటయే గొప్ప కోరికయగును.

ప్రశ్న : హృదయములో కోరిక లుంచుకొని భగవంతుని భజించుట మంచిదా? ఏ కోరికయు కోరక (నిష్కామముగా) దేవుని భజించుట మంచిదా?

సమా : నిష్కామభావముతో దేవుని భజించుటయే గొప్పది. ఎందుచేతననగా, నిజముగా మన కేమి కావలెనో, అవసరము కాని దేదో (ఏది రావలెనో, ఏమి పోవలెనో) దేవునికే తెలియునుగాని మన కేమియు తెలియదు. భ్రాంతి చేత మనము శాశ్వతానందము గలిగించువానిని కోరుకొనక బంధము, పాపము, అపకీర్తి, అశాంతియు వృద్ధియగు కోరికలను కోరుచుందుము. నిష్కామముగానుండి పూజ, భగవన్నామ సంకీర్తన, జపము, ధ్యానము మొదలైన సత్కర్మలను చేయుచున్నచో మన యోగక్షేమముల నన్నిటిని ఆ భగవంతుడే వహించుచుండును. ఇదియే నిజమైన అమృత జీవనము.

ప్రశ్న : సర్వేశ్వరు డెవరి సొమ్ము?

సమా : సంసారము సకాలముల సొమ్మైతే, సర్వేశ్వరుడు నిష్కాముల సొమ్మగును.

ప్రశ్న : ఎట్లు వర్తించిన దేవుడు కనబడును?

సమా : సర్వులున్ను భగవంతుని బిడ్డలే యను భావముతో ఏ ప్రాణికిన్ని బాధ కలిగించకుము. సర్వమున్ను భగవంతునిదే యను భావముతో నాది, నావారు యను భావములను వదలియుండుము. 'శివునియాజ్ఞ లేనిదే చీమ యైననుకుట్ట'దను భావముతో సుఖదుఃఖములు, స్తుతినిందలు, లాభనష్టములున్ను కలిగినను దైవచింతనతో ఓర్పుగలిగి యుండుము. ఇట్లు ప్రవర్తించినయెడల తప్పక నీకు దేవుడు కనబడును.

ప్రశ్న : దేవుని కెన్ని రూపములు కలవు?

సమా : సాకారము, నిరాకారము యను రెండు రూపములు కలవు.

ప్రశ్న : సాకార మెట్లు కనబడును? నిరాకార మెట్లు కనబడును?

సమా : భగవన్నామమును అనన్యభక్తితో స్మరణ చేయుచుండుటవలన సాకారదేవుడు కనబడును. దేహాభిమానమును వదలి సోహం మంత్రార్థమును సద్గురువుద్వారా తెలిసికొని చింతనచేయుచుండుటవలన నిరాకారదైవమగు సత్యము, జ్ఞానము, ఆనందము, అఖండము, నిర్వికల్పము, నిర్వికారము, నిర్గుణము నైన పరబ్రహ్మానుభవము కలుగును.

ప్రశ్న : భక్తికి, జ్ఞానమునకును భేదమేమి?

సమా : నేను వేరు, దేవుడు వేరను భావముతో ప్రేమచూపుట భక్తి యగును. నేనే దేవుడు. నాకంటే

అన్యముగా నేదియు లేదను నిశ్చయానుభవము జ్ఞాన మగును. భక్తిలో దేహాభిమాన ముండును. జ్ఞానములో నామరూపాది దేహాభిమానము లుండవు.

ప్రశ్న : మానవున కెన్ని సంపద లుండవలెను?

సమా : భౌతికసంపద, ఆరోగ్యసంపద, భక్తిసంపద, వైరాగ్యసంపద, ధర్మసంపద, జ్ఞానసంపద నుండవలెను.

ప్రశ్న : ఆ సంపదలన్నియు నెట్లు గలుగును?

సమా : మనోవాక్కాయములతో, నిష్కామభావముతో భగవంతుని, గురువులను సేవించుటవలన కలుగును.

ప్రశ్న : నేను దేవుడనా? జీవుడనా?

సమా : దేహాభిమానము పోయినపుడు దేవుడవే. దేహాభిమానముతో సుఖదుఃఖములను పొందుచున్నంత వరకును జీవుడవే.

ప్రశ్న : ఈ దేహములో నా దైవస్వరూపమెట్లున్నదో గుర్తుగా చూపండి.

సమా : నీ దేహమును (లోకమును) నేత్రములు చూచుచున్నవి. నీ నేత్రములను మనస్సు (బుద్ధి) చూచుచున్నది. నీ బుద్ధిని దేవుడవగు నీవే చూచుచున్నావు. నీకంటె పైన వేరుగా నెవ్వరున్ను లేరు.

ప్రశ్న : నాకు దుఃఖములు వచ్చినపుడు నేను బ్రహ్మానంద స్వరూపుడ నను భావములో నుండజాలక, నేను దుఃఖిని నేను సుఖిని యని నిశ్చయముతో నుంటున్నాను. కారణమేమి?

సమా : నీ నిజస్వరూపమైన నిర్వికల్ప దైవస్వరూపమును మరచి, నామరూపమయమైన దేహాభిమానముతో

నుండుటవలన, అనంతానందము నొందలేక సుఖ దుఃఖముల నొందుచున్నావు.

ప్రశ్న : సుఖ దుఃఖముల నే నెట్లు దాటగలను?

సమా : నీ దైవత్వమును నీవు సర్వదా గుర్తులో నుంచుకొనినచో దాటగలవు.

ప్రశ్న : నేను దేవుని భజించే (ధ్యానించే) భావము లెన్ని గలిగియుండును ?

సమా : నీవు తమోగుణముతో నున్నపుడు భయము, దుఃఖము గలిగినపుడే దేవుని ధ్యానించెదవు. నీవు రజోగుణముతో నున్నపుడు ధనమును, కీర్తిని యిమ్మని ఫలాపేక్షతో దేవుని భజించే స్వభావము గలిగియుందువు. నీవు సత్త్వగుణముతో నున్నపుడు దేవుని నిష్కామభావముతో నిజమైన భక్తిభావముతో భజించే స్వభావము గలిగియుందువు. నీవు గుణత్రయాతీతస్థితిలో నున్నపుడు అద్వైతభావముతో నిర్వికల్పానందమయముగా ప్రకాశించుచుండ గలుగుదువు. ఇదే కైవల్యము, మోక్షము.

ప్రశ్న : లోకవిషయములమీదకు రాగద్వేషాది వృత్తులతో పోవుచున్న నాయొక్క మానసాదీంద్రియములను నిగ్రహించి దైవసంబంధమైన వృత్తులతో నే నెట్లు తృప్తి పరచవలెను ?

సమా : నీ మనస్సు లోకవిషయములమీదకు పోవుచున్నప్పుడు శ్రీరామ, శ్రీకృష్ణ, శివ, ఓమ్ నారాయణ యను నామములలో నీకు ఇష్టమైనవానిని జపము చేయుచు, భగవంతుని దివ్యచరిత్రను వర్ణించుకొనుచు, భగవంతుడు

భక్తులను కాపాడిన విధములను వర్ణించుకొనుచు సంతో షించుచుండుము. ఇట్లే నీ వాక్కు అనవసర ప్రసంగముల లోనికి పోవ నిచ్ఛగించునపుడు భగవన్నామ సంకీర్తనతోను, భగవత్కథలను పఠించుటతోను వాక్కును తృప్తిపరచుము. ఇట్లే నీ చేతులు వ్యర్థముగా చలించుచున్నచో దేవునికి పూజ, నమస్కారములు చేసియు, పెద్దలకు సేవచేసియు తృప్తిపరచుము. ఇట్లే నీ పాదములు చంచలముగా నున్నపుడు దేవతల దర్శనముకొరకు, పెద్దల దర్శనము నిమిత్తము, తీర్థ సేవనముకొరకు నడిపించి తృప్తిపరచుము.

## ఆరు ప్రశ్నోత్తరములు

ప్రశ్న: దేవు డనగా నెవరు? 1

సమా: ఈ కనబడుచున్న, వినబడుచున్న జగ మంతయు భగవత్స్వరూపమే. ఇది సాకారదైవము. దీనికి (ఈ దేహమునకు) అధిష్ఠానముగానున్న పరబ్రహ్మము నిరాకారదైవ మనబడును.

ప్రశ్న: భగవంతుని పొందిన లాభమేమి గల్గును? పొందకున్న నష్టమేమి కల్గును? 2

సమా: భగవంతుని పొందినచో దుఃఖ మేమాత్రము నుండకపోవుటయే గాక ఎల్లప్పుడును బ్రహ్మానందముగా నుండును. ఇదే పరమ లాభము. భగవంతుని పొంద కున్నచో దేహాభిమానము ఉండును. కనుక భగవంతుని కంటే అన్యమైన భావములగు నేను నీవు, నాది నీది, నావారు నీవారు, శత్రువు మిత్రుడు, స్త్రీ పురుషుడు,

కుక్క నక్క, పశువు పక్షి, చీమ పురుగు, మన్ను బంగారము మొదలగు రాగద్వేషములతో గూడిన భావములు పుట్టి దుఃఖము, భయము, క్రోధము, దిగులు, చింత జననము మరణములు కలుగుచుండును. ఇదే దేవుని పొందనిచో గలుగు నష్టము.

ప్రశ్న : భగవంతుని పొందించే ధర్మము లెవ్వి ? 3

సమా : పూజ, నమస్కారములు, స్తుతి, సంకీర్తన, జపము. ధ్యానము, అహింస, సత్యము, దొంగతనము చేయకుండుట, వ్యభిచారము చేయకుండుట, నిత్యానిత్య విచారణ, సంకల్పములను నశింపచేయుటయును భగవంతుని పొందించే ధర్మములగును.

ప్రశ్న : భగవంతుని పొందనీయక అడ్డువచ్చున వెవ్వి? 4

సమా : కామము, ఆశ, క్రోధము, మమకారము, అహంకారము, గర్వము, నేను నీవు యను భేదబుద్ధియు, భగవంతుని తలంచనీయక, చూడనీయక, పొందనీయక అడ్డువచ్చుచున్నవి.

ప్రశ్న : ఈ శరీరములో భగవంతుని పొందే వాడెవడు ? 5

సమా : నామములచే (శబ్దములచే), రూపములచే, పనులచే దుఃఖములను, సుఖమును, భయమును, చావు పుట్టుకలను పొందుచున్నవాడెవడో, ఆ జీవుడు భగవంతుని పొందజాలడు. నామ, రూప, క్రియలపై పూర్తిగా మోహము నశించినప్పుడు భగవంతునిలో ఐక్యమొంది సమానత్వము నొందుచున్నాడు.

ప్రశ్న : దేవు డనునపుడు ఒక్కడేనా? అనేకు లున్నారా? 6

సమా : సగుణ (సాకార) దృష్టితో నున్నవారికి శ్రీహరి, శివ, రామ, కృష్ణ, నారసింహ, సుబ్రహ్మణ్య, ఆంజనేయ, దత్తాత్రేయ, దేవీ, సాయి మొదలగు అనేకమందిగా దేవుడు తోచుచుండును. నిరాకార నిర్గుణ నిర్వికల్పదృష్టితో నున్నవారికి దేవుడు ఒక్కడుగానే తోచును.

## భగవత్ప్రాప్తి సాధన

ప్రశ్న : స్వామీ! మానవజన్మ మెత్తిన తరువాత భగవంతుని భజించవలెననియు, భగవంతుని తెలిసికొనవలెననియు, భగవంతుని పొందవలెననియు, దైవజ్ఞానము లేనివారు పశువులతో సములనియు, అట్టివారు దుఃఖముల ననుభవించుచుందురనియును నేను వినియుంటిని. అసలు దేవు డనగా నెవరు?

సమా : నీవే దేవుడవు, నీ నిజస్వరూపమే దైవస్వరూపము. పరబ్రహ్మానందమే దైవస్వరూపము.

ప్రశ్న : నాకు దేహమే నేనను భావన, సుఖదుఃఖము లనుభవించుచున్న జీవుడనే నేనను భావమును గలదే గాని, ఆనందస్వరూపుడగు దేవుడనే నేనను నమ్మకము, అనుభవమును లేదేమి?

సమా : నీలో పాపము, అజ్ఞానము నుండుటవలన నీకు దైవజ్ఞానము లేదు.

ప్రశ్న : నాలో పాపమేది? పుణ్యమేది? అజ్ఞానమేది? దైవస్వరూపమేది?

సమా: చెడు కోరికలు, చెడ్డ ఇచ్ఛలు, చెడు పనులున్ను నీలో పాప మగును. మంచి కోరికలు, మంచి ఇచ్ఛలు, మంచి పనులున్ను నీలో పుణ్య మగును. దేహముపై, ధనముపై, బంధు మిత్ర భార్యాపుత్రాదులపైని గల అభిమానము, మమ కారమును నీలో అజ్ఞాన మగును. నిద్రావస్థను, స్వప్నావస్థను, జాగ్రదావస్థను తెలిసికొనుచున్న తెలివియే, (నీమనస్సంకల్ప ములను తెలిసికొనుచున్న తెలివియే) నీలో దైవస్వరూప మగును. ఆ చైతన్యమే నీ నిజస్వరూపము నగును.

ప్రశ్న : నాలో గల అభిమానము (అజ్ఞానము), పాప దోషములున్ను నశించి భగవంతునిపై భక్తిగలుగుటకు నే నెట్లు ప్రవర్తించవలెను?

సమా: నీవు మొదట పాపములేని జీవనము చేయ వలెను. అనగా అన్యాయము, జీవహింస, అసత్యము, దొంగ తనము, దూషించుట, స్వార్థము, కపటము, మోసము మొదలగు పాపపు వర్తనలు లేకుండ సంపాదించుకొనుచు జీవించుచుండవలెను. తరువాత తల్లిదండ్రులసేవ, దేవునిసేవ, గురుసేవ, అతిథిసేవ, భూతసేవలను చేయుచు ఫలాపేక్ష లేకుండ సుకృతము నార్జించుకొనుచుండుము. దీనివలన హృదయము శుద్ధ మగును. హృదయశుద్ధిగలవారికే భగవంతునిపై భక్తి, జ్ఞానసాధనలపై నాసక్తియు గలుగును.

ప్రశ్న : సత్కర్మల నెంత కాలము చేయవలెను?

సమా: ఆత్మానాత్మ విచారణతో, జపస్మరణలతో, ధ్యాన సమాధులతో ఎల్లప్పుడున్ను సంతుష్టినొందు శక్తి గలుగువరకును (అంతరంగసాధనలలో నుండు శక్తి గలుగు వరకును) బాహ్య సత్కర్మల జేయుచునే యుండవలెను.

ప్రశ్న: దేవునిపై (పరమాత్మపై) దృష్టి స్థిరముగా నిలుచుటకు క్రమసాధన లెవ్వి?

సమా: భక్తులతోను, సాధువులతోను సాంగత్యము చేయుట, తీర్థయాత్ర చేయుట, భజనలు చేయుచుండుట, ఎల్లప్పుడును నాలుకపైని, గొంతుకలోను, మనస్సులోను భగవన్నామమును స్మరించుచుండుట. శరీరము, సంసారము, జగమును అనిత్యమైనవని, వైరాగ్యముతోనుండుట యను నీ సాధనలవలన పరమాత్మయందు మనస్సు స్థిరమగు చుండును.

ప్రశ్న: దేవుడు శాశ్వత మోక్షసుఖము నివ్వనిచో, సద్గురువు పరమాత్మస్వరూపమును చూపనిచో, భక్తులు దేవుని భజించి ఫలితము నేమి పొందెదరు? శిష్యులు గురు సేవచేసి ప్రయోజన మేమి సంపాదించుకొనగలుగుదురు?

సమా: భక్తులకు, మోక్షాపేక్షగలవారికి నాలుగు కృప లుండవలెనని వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. ఎట్లన (1) దేవుని కృప నొందుటకు భక్తులు పూజ, సేవ, భజన, స్మరణ, ధ్యానములను చేయుచుండవలెను. దేవుని కృపవలన మోక్షము నొందుటకు కావలసిన అనుకూలములన్నియును లభించును. ఇదే దేవుని భజించుటవలన గలుగు ప్రయోజనము.

2. సద్గురు కృప గలిగినచో, శిష్యులకు కావలసిన శాస్త్రధర్మములు అనుభవసందేశములు తెలియబడు చుండును.

3. వేదకృపయున్నచో, శాస్త్రధర్మములు గుర్తులో నుండును.

4. అంతఃకరణకృప యున్నచో గురువు చెప్పినట్లు, శాస్త్రము చెప్పినట్లు తపస్సుచేయుశక్తి, ఆచరించి అనుభవ మునకు తెచ్చుకొనుటకు ఆత్మబలమును కలుగును.

ప్రశ్న : స్వామీ! దేవుని భజించినచో ఆయన కృప గలిగి మోక్షము నొందుటకు కావలసిన అనుకూలము లన్నియు (మోక్షసాధన సామగ్రి యంతయు) లభించునని తమరు చెప్పినారు గదా. లోకములో భగవంతుని భజించు వారికే ఎక్కువగా రోగములు, దారిద్ర్యము, నిందలు, నష్టములు మొదలగు కష్టములు వచ్చుచున్నవే. బాధలు వచ్చుచున్నయెడల మోక్షసాధనలు సాగవుగదా.

సమా : నిజమైన మోక్షాపేక్షగలవారు, భక్తులున్ను కష్టములను కోరుదురేగాని సుఖములను (భోగములను) కోరరు. కష్టములవలన కోరికలు, మమకారములు, క్రోధము, అహంకారము, ఆడంబరములు నశించుచుండును. సుఖముల వలన అహంకారము, మమకారము, కోరికలు, క్రోధము, ఆడంబరములు మనశ్చలనమును పెరుగును.

కష్టములలో దైవసుఖమును చవిచూడవలెను. సుఖ ములలో దైవరుచి దొరకదు.

సుఖములు కలుగుట దేవుని కృపకాదు. కష్టములు వచ్చుటయే దేవుని అనుగ్రహ మగును.

లోకముపై, సంసారముపై, దేహముపైని గల మోహము వలన మానవుడు మోక్ష (శాశ్వత) సుఖమును గలిగించునట్టి ధర్మమును, భక్తిని జ్ఞానమును, వైరాగ్యమును, ఆత్మధ్యానమును మరచిపోవుచున్నాడు. కష్టములు (బాధలు) వచ్చుచున్నచో దేహముపై, సంసారముపై, ధనముపై, కీర్తిపై, భోగములపైనిగల ఆసక్తి నశించి ధర్మవర్తన, భక్తిజ్ఞానవైరాగ్యములు అభివృద్ధి యగుచుండును.

ధనము నశించుట, నిందలు వచ్చుట, బంధుమిత్రాదులతో గల సంబంధమును దూరముచేయుట, స్వస్థలమున నుండనీయక దూరప్రదేశమునకు పంపుట, శరీరమునకు గొప్ప వ్యాధి వచ్చుట, ఈ పంచ విధములుగా భగవంతుడు భక్తులకు బాధలు గలిగించెద నని భాగవతములో చెప్పెను.

"మీకుగల ఐశ్వర్యము లాగివేసి, బంధువులను తీసివేసి, అన్నాహారములకు అడలునట్లు చేసి, మిమ్ము పరీక్షింతుము. అప్పటికి శాంతముగా నున్నవారిని దగ్గఱకు జేర్చుకొందుము" అని బైబిలు చెప్పెను.

ప్రశ్న : నేను భక్తిమార్గములోనికి వచ్చినప్పటి నుండియు ఇంటిలో బాధలు, దేహములో బాధలు, ఇతర మానవులవలన బాధలు, వస్తువుల నష్టములవలన బాధలున్ను ఎక్కువగుచున్నవి. నా మెదడు చెడిపోవునేమో యని ఒక్కొక్కప్పుడు తలంచుచుందును. ఇట్టి బాధలలో

నే నేమి చేయవలెను? ఈ నా బాధలకు అంతముగలదా? లేదా?

సమా: పుణ్యమార్గమును (మోక్షమార్గమును) అవలంబించువారికి మొదట కష్టము లనేకములు వచ్చును. తరువాత అనంత సుఖము గలుగును. పాపమార్గమున నడచువారికి మొదట సుఖములు, అనుకూలములు, లాభములున్ను కలుగుచుండును. తరువాత అనంత బాధలు, ప్రతికూలములు నష్టములు, నిందలున్ను వచ్చును. అగ్నిలో బడిన మానవుని వలె బాధలు పడును. భీష్మాచార్యులవారికి కౌరవులపాపాహారమును భుజించుటచేత బుద్ధిమాంద్య మేర్పడి సత్యధర్మములు స్ఫురణకు రాలేదు. తరువాత యుద్ధములో అర్జునుని బాణములు తగిలి పాపపురక్తము కారిపోయిన తరువాత పరిశుద్ధ రక్తమే మిగిలియుండుటచేత అనేక ధర్మములు స్ఫురణకు వచ్చినవి. ఇట్లే మానవునకు పలువిధములైన బాధలు వచ్చుచున్న మాత్రమే ఇదివరకు చేసిన పాపకర్మదోషములు నశించి హృదయము పరిశుద్ధ మగును. పరిశుద్ధహృదయము గలవారికి జీవితధర్మము లన్నియును స్వయముగా తెలియబడుచుండును. శాశ్వతమైన పరమాత్మ గుర్తులో నుండును. కనుక కష్టములకు, బాధలకును భయపడకుము.

విభీషణుడు తపస్సు చేసినపుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై 'నీకేమి వరము కావలెనో కోరుకొమ్ము యిచ్చెద' నని చెప్పగా,

"పరమాపద్గత స్యాపి ధర్మే మమ మతి ర్భవేత్"

తా. 'గొప్ప ఆపదలు వచ్చినను నామనస్సు ధర్మము నందే నిలబడియుండునుగాక' అని వరమును కోరెను.

పాండవులు అరణ్యావాసమునందున్నప్పుడు శ్రీ కృష్ణుడు చూచుటకు వచ్చి మాట్లాడి వెళ్లబోవుచున్నప్పుడు ధర్మరాజు శ్రీకృష్ణునితో "కృష్ణా! మా కెన్ని కష్టములు వచ్చినను ధర్మము తప్పక నడచునట్టి భాగ్యమును దయ చేయుము" యని కోరెను.

నశించిపోయే సుఖములందు, లాభములందును ప్రీతిగల వారు, నశించని మోక్షమార్గమున నడచుటకు అర్హులు కాజాలరు.

దేహసుఖములపై విరక్తిలేనివారు ధర్మవర్తనలను, దైవధ్యానమును కాపాడుకొనలేరు.

దేవుని నమ్మి ఎల్లప్పుడును స్మరణ, ధ్యానము, భజన, పూజ, సేవలున్ను చేయుచు కాలమును గడుపుచున్నచో ఇహ సుఖము, పరసుఖమును తప్పక కలుగును.

పరమాత్మను మరచి వర్తించినవారికి అనేకబంధములు, కోరికలు, కర్తృత్వములు చుట్టుకొనుచుండును. దేవుని స్థానము (సుఖము) కోరికలు, ఆశలు లేనివారికే దొరుకును.

# విష్ణు వెక్కువా ? శివు డెక్కువా ?
# దేవి యెక్కువా ?

ప్రశ్న : స్వామీ! లోకములో కొందరు దేవతలలో విష్ణువు గొప్పవాడని వాదించుచున్నారు. కొందరు శివు డెక్కువయని వాదించుచున్నారు. ఈ రెండు వాదములలో ఏది సత్యమైనది ?

సమా : లోకములో విష్ణ్వాలయములు, శివాలయము లున్ను అధికముగా గలవు. ఇట్లే వైష్ణవులు, శైవులున్ను అధికముగా కనబడుచున్నారు. సాకార దృష్టిలో (సగుణ దృష్టిలో) విష్ణువునకు, శివునకు భేదము కనబడుచుండునే గాని నిరాకార (నిర్గుణ) దృష్టిలో విష్ణువు, శివుడున్ను ఏక స్వరూపులే యనబడుదురు.

సగుణదృష్టితో విష్ణువును ధ్యానించువారు వైకుంఠము నొందుదురు. సగుణదృష్టితో శివుని ధ్యానించువారు కైలాసమునకు చేరుదురు. శివ కేశవులలో గల నిర్గుణ, నిరాకార, అఖండ, అనంతానంద స్వరూపమునే ధ్యానించుచుండు వారు నిర్గుణ పరబ్రహ్మస్వరూపమగు కైవల్యమోక్షము నొందెదరు.

సగుణారాధకులకు పునర్జన్మ ముండును. నిరాకార ధ్యానపరులకు జన్మరాహిత్య స్థితి గలుగును.

సగుణారాధనద్వారా పాపదోషములను, దుర్గుణములను నశింపజేసికొనిన తరువాత, నిర్గుణారాధన చేయుచు మల విక్షేప ఆవరణదోషములను నశింపజేసికొని (మానసాదీంద్రియములను అతిక్రమించి) స్వస్వరూప పరబ్రహ్మానుభవము నొందవలెను.

సగుణారాధన చేయనిదే నిర్గుణారాధన సాధ్యపడదు.

ఒక దేవుని నమ్మి భజించుచుండునపుడు ఇతర దేవతలను, ఇతర మతస్థులను దూషించ కూడదు. నాదేవుడే ఎక్కువ, నామతమే గొప్పది యని పొగడుకొనరాదు.

## విష్ణువు, శివులకు అభేద నిరూపణ

'రుద్రో నారాయణశ్చైవ సత్యమేకం ద్విధాకృతమ్'.

తా. విష్ణువు యొక్క ఆకారము, శివుని యొక్క ఆకారమును వేరు వేరుగా కనబడుచున్నప్పటికి, సత్యముగా ఇరువురున్ను ఏకైకస్వరూపులే యగుదురు.

శ్లో. జ్ఞాన నిష్ఠో భవే ద్విష్ణుః క్రియా నిష్ఠః ప్రజాపతిః
ఇచ్ఛా నిష్ఠా శ్శివస్సాక్షాత్ మహావిష్ణు స్సమాహరః

తా. విష్ణువు జ్ఞాననిష్ఠ గలవాడు, బ్రహ్మ కర్మనిష్ఠ గలవాడు. శివుడు భక్తినిష్ఠ గలవాడు. శివ కేశవులిరువురకును భేదములేదు. విష్ణువు జగన్నాథుడు. శివుడు విశ్వనాథుడు. విష్ణువు నాగశయనుడు. శివుడు నాగభూషణుడు. విష్ణువు వైకుంఠవాసి. శివుడు కైలాసవాసి.

క్షీరసాగరమును దేవదానవులు మథనము చేసి నపుడు విష్ణువు, శివుడును సహాయము చేసిరి.

విష్ణువు, శివుడున్ను భక్తుల మృత్యు భయమును బాపుచుందురు. ఇందుకు ప్రమాణముగ రెండు కథలను సంగ్రహముగ చెప్పెద.

మార్కండేయులు శివపూజలో నుండగా యముడు మెడకు పాశమును వేసెను. వెంటనే మార్కండేయుడు శివలింగమును కౌగలించుకొని శివుని ప్రార్థించగా శివుడు లింగమునుండి ఆవిర్భవించి, యముని శూలముతో పొడవ పోవగా 'నేటి నుండి నీ భక్తుల జోలికిరా'నని శరణు బొంది యముడు స్వలోకమునకు వెళ్లిపోయెను. పదునారు సంవత్సరములు ఆయువు గల మార్కండేయుడు శివభక్తి వలనను, పెద్దల ఆశీర్వాదము వలనను చిరంజీవి యయ్యెను.

హరి అనంతవైష్ణవుడను ఒక గురువు గలడు. ఆయన శిష్యుడు ప్రతిదినమును భిక్షకు గాను గ్రామములోనికి వెళ్లు చుండును.

ఒకనాడొక సాధుపుంగవుడు భిక్షకు వెళ్లిన శిష్యునిచూచి 'నీవు రేపు చనిపోవుదువు' అని చెప్పెను. అప్పుడు శిష్యుడు వెంటనే భయముతో వణకుచు గురువగు హరి అనంత వైష్ణవుని దగ్గరకు వెళ్లి 'రేపు నేను చనిపోవుదునని ఒక సాధువు చెప్పె' నని చెప్పి దుఃఖపడుచుండెను. అప్పుడు గురువు గారు 'శిష్యా! భయపడకుము. నేను చెప్పినట్లు చేయుము. నీవు మృత్యువును జయించగలవు' అని చెప్పి ధైర్యము గలిగించి మరునాడు, 'ఓమ్ నమో నారాయణాయ' అను మంత్రమును

జపించుచు కూర్చొనమని నియమించెను. శిష్యుడు గురువు చెప్పినట్లే జపము చేయుచుండగా విష్ణుచక్రము వచ్చి శిరస్సు దగ్గర తిరుగుచుండెను. కొంతసేపటికి యముడు వచ్చి చూచి భయముజెంది తిరిగి వెళ్లిపోయెను. శిష్యుని మృత్యు గండము తప్పిపోయెను (భక్తవిజయము).

ఘంటాకర్ణుడు శివపూజాపరుడు. ఇతర దేవతల పేరైనను చెవిని వినబడరాదను పట్టుదలగలవాడు. అందు వలన ఎవరైనను ఇతరదైవ నామములను ఉచ్చరించినచో అవి తనకు వినబడకుండుటకు గాను చెవులకు రెండు గంట లను కట్టుకొనెను. వానికి తనయందలి గాఢభక్తి నెంచి తనకును, విష్ణువునకును భేదములేదని తెలియజేయ దలచి శివుడు సగము విష్ణువుగను, సగము శివుడుగను నుండు రూపమున ప్రత్యక్షమయ్యెను. ఆసమయమున ఘంటా కర్ణుడు తన దేవతకు ధూపమును సమర్పించుచుండెను. కాని యా ధూపము విష్ణు నాసికాపుటమున జొచ్చు చుండుట గాంచి దురభిమానపూరితుడగు నాతడు విష్ణువు ఆ సువాసనను పీల్చకుండుటకు గాను తనవ్రేలితో ముక్కు రంధ్రములను మూసివేసెను. అందులకు విష్ణువు కోపింపక మోక్షము నిచ్చెను.

పండరీపురమునందు నరహరియను విశ్వబ్రాహ్మణుడు శివభక్తాగ్రేసరుడై యుండెను. అతడు ఇతర దేవతల ఆలయములను కూడ చూడడు. ఇట్లుండగా, ఒకనాడొక ధనవంతుడు పాండురంగనికి మొలత్రాడు చేయించ దలచి నరహరిని 'మొలత్రాడు చేసి ఇవ్వవలసినది' అని కోరగా,

"నేను శివభక్తుడను గాన పాండురంగని చూడను. కనుక పాండురంగని నడుము కొలతవేసి, తీసికొనివచ్చిన యెడల మొలత్రాడుచేసి ఇచ్చెద" నని నరహరి చెప్పగా ధనవంతుడు పాండురంగని దగ్గరకు వెళ్లి నడుము కొలతవేసి తీసికొని వచ్చి నరహరి కిచ్చెను. కొన్నాళ్లకు మొలత్రాడు తయారయ్యెను. ధనవంతుడు వచ్చి తీసికొనివెళ్లి పాండురంగని నడుముకు పెట్టి చూడగా వదులైనది. అపుడు నరహరి దగ్గరకు తీసుకొనివెళ్లి చెప్పి ఇవ్వగా దానిని సరిచేసి ఇచ్చెను. మరల నడుముకు పెట్టి చూడగా కురచైనది.

అపుడు ధనవంతుడు నరహరిని "నేత్రములకు గంతలు కట్టుకొని నీవే పాండురంగని నడుమును కొలతవేసి తీసికొని వచ్చి మొలత్రాడును సరిచేయవచ్చు" నని చెప్పి రావలసినదని కోరెను. అందుకు నరహరి కొంతసేపు ఆలోచించుకొని, వచ్చుటకు నిశ్చయించుకొని వెళ్లి పాండురంగని చేతులతో తడుముచు నుండగా శివలింగముగా తోచుచుండెను. మరలమరల క్రింద, పైన, ప్రక్కలందును చేతులతో తడుముచున్నను శివలింగముగానే తోచుచుండెను. అపుడు సంశయమును తీర్చుకొనుటకు నేత్రములకు కట్టుకొనిన గంతను విప్పి చూడ పాండురంగడే కనబడెను. అప్పుడు నరహరి తన్మయ భక్తితో, "ఓ పరమేశ్వరా! నీవే విష్ణువు, నీవే శివుడవునై యున్నావు. నేను అజ్ఞానాంధకారములో నున్నవాడనై, నీ నిజ తత్త్వమును గుర్తించలేక కేశవాది దేవతామూర్తులను దూషించుచు కాలమును గడిపితిని. ఇకనుండి నా తప్పులను మన్నించి కాపాడు చుండుము" అని

పలువిధములుగా ప్రార్థనలు చేసి, భేద వర్తనమును విడనాడెను.

ఉత్తరదేశములో ఉదయపూరు దగ్గర ఏకలింగజీ క్షేత్రము గలదు. ఆ లింగము బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, సూర్యభగవానుడు అను నాలుగు ముఖములతో నుండును. ఈ లింగమునకుగల నాగేంద్రుని మణులు లక్షన్నర రూపాయల విలువగలవై యుండునట. ఆ లింగము కూడ మనకు త్రిమూర్తులకు భేదములేదని చూపుచున్నదిగదా.

శ్లో. ఏకైవమూర్తి ర్బిభిదే త్రిధాసా
సామాన్య మేషాం ప్రథమావరత్వమ్
విష్ణో ర్హరస్తస్య హరిః కదాచిత్
వేధాస్తయో స్తావపి ధాతురాద్యౌ.

తా. మొదటి మూర్తి ఒక్కటే. అది మూడుమూర్తులుగా భేదిల్లినది. ఈ త్రిమూర్తులకు గొప్పతనమును, తక్కువతనమును సమానమే యగును. ఒకప్పుడు విష్ణువుకంటే శివుడు గొప్పయగును. ఒకప్పుడు శివునికంటే విష్ణువు గొప్ప యగును. ఒకప్పుడు శివకేశవులకంటే బ్రహ్మ గొప్ప యగును. ఒకప్పుడు బ్రహ్మకంటే శివకేశవులు గొప్పవారుగా నుందురు. (అని కుమారసంభవ కావ్యములో మహాకవి కులగురువగు కాళిదాసు చెప్పెను)

'ఏకం సత్ విప్రా బహుధా వదంతి'

తా. ఏకైక సత్యపరమాత్మనే మహాత్ములు అనేక పేరులతో పిలుచుచుందురు.

శ్లో. శివాయ విష్ణు రూపాయ శివ రూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః

తా. విష్ణు స్వరూపుడగు శివునికి, శివ స్వరూపుడగు విష్ణువునకు నమస్కారము. శివుని హృదయము విష్ణువు. విష్ణుని హృదయము శివుడు. అనగా శివ కేశవులకు భేదములే దని తాత్పర్యము.

శ్లో. మద్భక్త శ్శంకర ద్వేషి, మద్ద్వేషీ శంకర ప్రియః
తా వుభౌ నరకం యాతో, యావచ్చంద్ర దివాకరమ్

తా. శివుని ద్వేషించే విష్ణుభక్తుడున్ను, విష్ణుని ద్వేషించే శివభక్తుడున్ను సూర్యచంద్రు లున్నంత వరకును నరకము నొందెదరు.

నిర్గుణ పరబ్రహ్మమే శివ కేశవాది దేవతలుగా కనబడుచుండును.

శ్లో. మహేశ్వరేవా జగతా మధీశ్వరే
జనార్దనే వా జగ దంతరాత్మని
న వస్తుభేదప్రతిపత్తి రస్తిమే
తథాపి భక్తిః తరుణేందుశేఖరే.

తా. సర్వ లోకేశ్వరు డగు శివుడు, సర్వ జగదంతర్యామి యగు విష్ణువును ఒకటే యైనప్పటికి (ఇరువురికి భేదము లేనప్పటికిన్ని) 'శివునియందే నాకు భక్తి కుదిరి యుంటున్నది' అని భర్తృహరి చెప్పెను.

శ్లో. శైవావయం న ఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీ జప పరాని తరాంతథాపి

చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరమ్

తా. "మేము, శైవుల మనుటలో సందేహ మేమీ లేదు. 'ఓమ్ నమశ్శివాయ' అనే పంచాక్షరీ జపపరాయణులమే అయినప్పటికిన్ని అదేమిటోగాని నల్లకలువపూవు వలె శ్యామసుందరుడై, సుందరముఖుడై, యశోదాతనయుడైన బాలకృష్ణునే నా మనస్సు తలంచుకుంటూ నుండును" అని ఒకభక్తుడు చెప్పెను.

శ్లో. యంశైవా స్సముపాసతే శివఇతి బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధాః బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోయంవో విదధాతువాంఛితఫలం త్రైలోక్యనాధోహరిః

తా. ఏ దేవుని శివ మతస్థులు శివు డనుచున్నారో, ఏదేవుని వేదాంతులు బ్రహ్మ మనుచున్నారో, ఏదేవుని బౌద్ధ మతస్థులు బుద్ధు డని చెప్పుచున్నారో, ఏ దేవుని న్యాయవాదులు కర్తయని చెప్పుచున్నారో, ఏదేవుని జైన మతస్థులు అర్హతు డనుచున్నారో, ఏదేవుని మీమాంసకులు కర్మ యనుచున్నారో ఆ త్రిలోకేశ్వరుడైన శ్రీహరి మన కోరికలను నెరవేర్చునుగాక.

వైష్ణవానాం యథా శంభుః
శాంభవానాం యథా విష్ణుః

తా. వైష్ణవులలో ప్రధాని శివుడు, శైవమతస్థులలో ప్రధాని విష్ణువు.

పై శ్లోకముల ప్రమాణముల ననుసరించి దేవుడొక్కడే గాని అనేకులు లేరని తెలియుచున్నది గదా!

ప్రశ్న: స్వామీ! లోకములో విష్ణువునకు, శివునకు భక్తుడుగా నుండవచ్చునా?

సమా: అర్జునుడు విష్ణువునకును, శివునకును భక్తుడే గదా! అర్జునుడు శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా శివుని ధ్యానము చేసి రెండుపర్యాయములు అస్త్రములను సంపాదించెను.

అర్జునుని ముందు శివుడు సూక్ష్మరూపముగా నుండి కౌరవులతో యుద్ధము చేసెను.

కౌరవులను చంపినది నిజముగా శివకేశవు లిరువురే గాని పాండవులు, పాండవసైన్యమును కాదని భీముని మనుమడగు బర్బరీకుని చరిత్రవలన తెలియుచున్నదిగదా!

నారదుడు విష్ణుభక్తుడు, శివభక్తుడు నగును. త్యాగరాజు శివకేశవుల నిరువురను భజించెను.

విష్ణువున్నచోట శివుడు కలడు. శివుడున్నచోట విష్ణువు కలడు.

లింగము శివుడయితే, పానుమట్టము విష్ణువేగదా.

## పూర్వపు విషుభక్తులు

శ్లో. ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి.

తా. ప్రహ్లాదుడు, నారదుడు, పరాశర మహర్షి, పుండరీకుడు, వ్యాస మహర్షి, అంబరీషుడు, శుకమహర్షి, శౌనకమహర్షి, భీష్మాచార్యులు, అల్భ్య మహర్షి, హనుమంతుడు, రుక్మాంగదుడు, అర్జునుడు, వశిష్ఠుడు, విభీషణుడు, రామదాసు, కబీరుదాసు, తులసీదాసు' నామదేవుడు, ఘోరాకుంబారుదాసు, సమర్థరామదాసు, శబరి, సక్కుబాయి, మీరాబాయి, తరిగొండ వేంకమాంబ, జనాబాయి మొదలగువారు అనేకులు విష్ణుభక్తులు కలరు.

## పూర్వపు శివభక్తులు

శ్లో. దూర్వాస కౌశిక విరించి మృకండుపుత్రాన్
దేవేంద్ర బాణ హరి శక్తి దధీచి రామాన్
కణ్వాది భార్గవ బృహస్పతి గౌతమాదీన్
ఏతానహం పాశుపతా న్నమామి.

తా. దూర్వాస మహర్షి, కౌశిక (విశ్వామిత్ర) మహర్షి, బ్రహ్మదేవుడు, మార్కండేయ మహర్షి, దేవేంద్రుడు, బాణాసురుడు, విష్ణువు, శక్తిమహర్షి, దధీచి మహర్షి, శ్రీరాముడు, కణ్వ మహర్షి, పరశురాముడు, బృహస్పతి, గౌతమ మహర్షి, సుగ్రీవుడు, రావణుడు, మారీచుడు, రావణాసురుని తల్లి, గుడగూచి, పిట్టువాణి, నందనారు, కన్నప్ప, రమణ మహర్షి, నరహరి మొదలగువారు అనేకులు శివ భక్తులు కలరు.

ప్రశ్న : స్వామీ! లోకములో వైష్ణవులు ఎన్ని విధములుగా నుందురో, శైవులు ఎన్ని విధములుగా నుందురో

సంగ్రహముగా తెలియజేయవలసినదని కోరుచున్నాను. సెలవిచ్చెదరా?

సమా: వైష్ణవులలోను, శైవమతస్థులలోను భేదములు గలవు. తెలిపెద వినుము.

## విష్ణువు అధికుడనుటకు ప్రమాణములు

విష్ణువునుండి బ్రహ్మ పుట్టెను. బ్రహ్మనుండి శివుడు పుట్టెను.

ఒకప్పుడు సప్త మహర్షులు యజ్ఞముచేయుచుండగా "ఈ యజ్ఞఫలదాత ఎవ"రని ఒక ఋషి వచ్చి ప్రశ్నించగా, ఎవ్వరున్ను చెప్పలేదు. చివరకు "నేను పోయి తెలిసికొని వచ్చెద"నని భృగు మహర్షి బయలుదేరి మొదట బ్రహ్మ లోకములో గల బ్రహ్మదగ్గరకు వెళ్లగా ఆయన పలుకరించ లేదు. అచ్చటనుండి కైలాసమునకు పోయి శివుని దగ్గరకు వెళ్లగా ఆయన త్రిశూలముతో పొడవబోయెను. అప్పుడు "లోకములో నీ శరీరాకారముతో పూజ్యత లేకపోవును గాక" యని శివుని భృగువు శపించెను. తరువాత వైకుంఠమునకు పోయి విష్ణువును దర్శించి ఆయన శాంతమునకు సంతసించి, త్రిమూర్తులలో విష్ణువే అధికుడని భృగు మహర్షి నిర్ణయించెను. పార్వతి శ్రీకృష్ణునకు భార్యగా (జాంబవతిగా) పుట్టెను. విష్ణువుయొక్క పాదమునుండి గంగ పుట్టి శివుని శిరమున పడి భూమిపై ప్రవహించెను.

శివుడు పార్వతికి విష్ణువు యొక్క మహాత్మ్యమును బోధించెను.

శివుడు పార్వతికి శ్రీరామతారకమహామంత్రము నుపదేశించెను.

శ్రీరాముడు సతీదేవికి (పార్వతికి) విశ్వరూపమును అరణ్యములోనే చూపెను.

శివుడు బ్రహ్మయొక్క ఐదవ శిరమును గిల్లివేసినప్పుడు బ్రహ్మహత్యాదోషము వలన శివుని చేతికి శిరము అంటుకొనుటచే బాధపడెను. అప్పుడు విష్ణువే వదలింప జేసెను.

శ్లో. అహం జపా మదేవేశి రామనామాక్షర ద్వయమ్
శ్రీరామ స్వస్వరూపస్య, ధ్యానంకృత్వా హృదిస్థలే॥

తా. ఓ పార్వతీ! హృత్కమలమందు శ్రీరామ స్వరూపమును ధ్యానించుచు, 'రామ' అను రెండక్షరములను నేను జపము చేయుచున్నాను.

భస్మాసురుడు తపస్సుచేసి శివుని వలన చేతితో శిరమును తాకినంతమాత్రమున భస్మమగునట్లు వరము నొంది శివునిశిరమున చేతిని పెట్టబోవగా శివుడు భయముతో పారిపోయి విష్ణువును రక్షించ వలసిన దని వేడుకొనెను. అపుడు విష్ణువు మోహినీ వేషము వేసికొని భస్మాసురుని దగ్గరకు వెళ్లగా అతడు కామాతురుడై మోహినిని పట్టుకొనుటకు రాగానే, "నీవు శుభ్రముగా స్నానముచేసి వచ్చి నన్ను పట్టుకొను"మని మోహిని చెప్పగా రాక్షసుడు స్నానముచేయుటకు వెళ్లి నీటిలో మునిగి లేచి తన శిరమును తానే తాకగా నీటిలోనే శివుడిచ్చిన వరము వలన భస్మమయ్యెను. అప్పుడు శివుడు తన ప్రాణాపాయము తప్పిపోయిన దని సంతసించెను.

పూర్వము గజాసురు డను రాక్షసుడు శివుని గురించి తపస్సుచేసి శివుడు తన హృదయమందే యుండునట్లు వరము నొందెను. అప్పుడు శివుడు గజాసురుని హృదయమందు నివసించియుండెను. అపుడు పార్వతీదేవి భర్తజాడ తెలియక వెదకుచు చివరకు గజాసురుని హృదయంలో నున్నట్లు తెలిసికొని పార్వతీదేవి విష్ణుమూర్తి దగ్గరకువెళ్లి "ఓ మహానుభావా! పూర్వము భస్మాసురుని బారినుండి నా పతిని రక్షించి నా కొసగితివి. ఇప్పుడు గూడ ఉపాయముచే రక్షించవలసిన దని వేడుకొనగా, శ్రీహరి బ్రహ్మాది దేవతలను వెంటబెట్టుకొని చిరుగంటలు సన్నాయిమేళము మొదలగు వాయిద్యములతో నందిని గంగిరెద్దుగాజేసి ఆడించుచు గజాసురుని సంతోషములో ముంచగా, "మీ కేమి వరము కావలెనో కోరుకొను"డని గజాసురు డనెను. అపుడు విష్ణువు "ఈ నందిని శివుని వాహనము గాన, శివుని యిమ్ము" అని కోరి నందినిచే గజాసురుని చంపించి, శివుని బైటకుతీసి పార్వతీదేవికి సంతోషము గలిగించెను.

రావణాసురుడు శివుని గురించి తపస్సుచేసి వరముల నొంది దేవతలను, ఋషులను, మానవులను బాధపెట్టు చుండగా శ్రీ మహావిష్ణువు శ్రీరామావతార మెత్తి రాక్షసులను చంపి భూలోకమును ఆనందమయ మొనర్చెను.

బాణాసురుడు శివుని గురించి తపస్సుచేసి వరముల నొంది వేయి చేతులు గలవాడై శివునితోనే యుద్ధముచేయ నెంచగా శివుడు భయము జెందెను. తరువాత శ్రీకృష్ణ

భగవానుడు వచ్చి బాణాసురుని చేతులను నరికివేసి బాణాసురుని మద మణచెను.

"సర్వదేవ మయో హరిః"

తా. విష్ణువు సమస్త దేవతా స్వరూపుడు.

"సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి"

తా. ఏ దేవతకు నమస్కరించినను సర్వాంతర్యామి యగు విష్ణువునే పొందుచున్నది.

## దశవిధ వైష్ణవులు

శ్లో. అద్వేష శ్చానుకూలీచ దివ్యనామధర స్తథా
చక్రాంకో మంత్రపాఠశ్చ వైష్ణవశ్చ తతః పరమ్
శ్రీవైష్ణవః ప్రపన్నశ్చ ఏకాంతీచ తతః పరమ్
పరమైకాంతీతి విఖ్యాతో దశైతే వైష్ణవాః స్మృతాః

తా. (1) మహావిష్ణువును, వైష్ణవులను ద్వేషించనివాడు అద్వేషు డను వైష్ణవుడు.

(2) వాసుదేవుని ఉత్సవములను గాని, భాగవతోత్తములను గాని సేవించి, వారి కనుకూలముగ నిత్యము అనువర్తించి యుండునో వాడు అనుకూలు డను వైష్ణవుడు.

(3) శ్రీ మహావిష్ణువు యొక్క నామమును తలచు చుండుట, ఉచ్చరించుటయు సమస్తపాపములను నశింప జేయును. అట్టి పుణ్య మగు విష్ణునామమును ధరించువాడు నామధారి వైష్ణవుడు.

(4) శ్రీమహావిష్ణువు యొక్క చక్రచిహ్నమును ధరించవలసినదిగ శ్రుతులలో చెప్పబడియున్నది. అటుల ధరించువాడు చక్రధారీ వైష్ణవుడు.

(5) శ్రీమన్నారాయణాష్టాక్షరీ మంత్రమును స్మరించినంతమాత్రముననే విష్ణువు మోక్ష మిచ్చునుగాన, ఆమంత్రమును పదేశమునొంది, దానిని ప్రతినిత్యము జపించుచుండువాడు మంత్రపారక వైష్ణవుడు.

(6) ఇతర దేవతలను వదలినట్లు, శబ్దస్పర్శాది విషయ భోగములను వదలినవాడై, శ్రీమహావిష్ణువుయొక్క సాయుజ్య ముక్తిని కోరువాడై, అందులకు భక్తిని ఉపాయముగా నవలంబించియుండువాడు వైష్ణవు డనబడును.

(7) శబ్దాది విషయములను చక్కగా విడిచి శాంతి దాంతులచే ఎల్లప్పుడు శుచియై శ్రీమహావిష్ణువునందు భక్తి గలవాడై యుండువాడు శ్రీవైష్ణవు డనబడును.

(8) శబ్దాది విషయ సుఖములను, దేహసంబంధులైన బంధువులను పూర్తిగ విడిచిపెట్టి, శ్రీమహావిష్ణువునందు తన సమస్తభారమును సమర్పించి యున్నవాడు ప్రపన్నుడను వైష్ణవుడు.

(9) కర్మ, జ్ఞానములను భగవదాజ్ఞారూపములుగ దలచి వానియందు ఫలాభిలాష, నేను చేయుచున్నాననుకర్తృత్వమును లేనివాడై భగవంతునికి శరణాగతుడై యుండువాడు ఏకాంతు డను వైష్ణవుడు.

(10) కర్మ, జ్ఞానములను కేవలము వాసుదేవప్రీతి కరముగ జేయుచు భగవత్, భాగవత, ఆచార్య నిష్ఠా యుక్తుడై యుండువాడు పరమైకాంతు డను వైష్ణవుడు.

## వైష్ణవుల విశ్వాసము

శ్లో. హరేర్నామ హరేర్నామ హరేర్నామైన కేవలమ్
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథాం

తా. కేవలము శ్రీహరినామస్మరణచే దప్ప ఈ కలియుగమున మనుజులకు తరించుటకు వేఱు మార్గము లేదు. ముమ్మాటికి లేదు.

శ్లో. ద్వౌభూతసర్గౌ లోకేసిన్ దైవ ఆసుర ఏవచ
విష్ణుభక్తః స్మృతో దైవ ఆసుర స్త ద్విపర్యయః

తా. లోకములో దేవమానవులు, అసుర (రాక్షస) మానవులు అను రెండు విధముల మానవులు కలరు. విష్ణు భక్తిగలవారు దేవమానవు లనబడుదురు. భక్తిలేనివారు రాక్షసు లనబడుదురు.

శ్లో. సంసార విష వృక్షేయః సర్వతో౽తి భయంకరః
విష్ణుభక్తి కుఠారేణ, భిద్యతే నాన్యథా భువి

తా. అతి భయంకరమైన, సంసారదుఃఖరూపమైన విషపు వృక్షమును నరికివేయుటకు విష్ణుభక్తి యనెడి గొడ్డలి తప్ప వేరే సాధన లోకములో లేదు.

శ్లో. జలే విష్ణుః స్థలే విష్ణుః, విష్ణుః స్థావర జంగమాః
అంత ర్విష్ణుః బహి ర్విష్ణుః, సర్వం విష్ణుమయం జగత్

తా. జలము, స్థలము, ప్రాణులు, వృక్షములు, పర్వతములు లోపల, వెలుపల సర్వమును విష్ణు స్వరూపమే,

## శివుడు అధికు డనుటకు ప్రమాణములు

సదాశివునుండి—(1) అనంతేశ్వరుడు, (2) సూక్ష్మేశ్వరుడు, (3) శివోత్తమేశ్వరుడు, (4) ఏకనేత్రేశ్వరుడు, (5) ఏకరుద్రేశ్వరుడు, (6) త్రిమూర్తీశ్వరుడు, (7) శ్రీకంఠేశ్వరుడు (8) శిఖండీశ్వరుడు అను ఎనిమిదిమంది పుట్టిరి.

అనంతేశ్వరుని వలన కైలాసాధిపతియైన శ్రీకంఠ రుద్రుడు పుట్టెను. వీని వలన విష్ణువు పుట్టెను.

ఒకప్పుడు బ్రహ్మ, విష్ణువు కలహించుకొని శివుని దగ్గరకు రాగా బ్రహ్మను శిరమును, విష్ణువును పాదములను చూచుటకు వెళ్లమని చెప్పగా విష్ణువు వరాహరూపము నొంది పాతాళము వరకు వెళ్లియు శివుని పాదములను గనుగొన జాలక తిరిగి వచ్చెను. బ్రహ్మ శివుని శిరమును చూచుటకు పైలోకము లన్నిటిని దాటి చూచినను కనబడక తిరిగి వచ్చి "చూచితి"నని అసత్యమాడెను. గోవును, మొగలిపువ్వును సాక్ష్యముగ తీసికొని వచ్చెను. అపుడు శివుడు కోపము గలవాడై ముగ్గురకును శాపమిచ్చెను.

విష్ణువు శివుని వాహనముగా వృషభరూపము ధరించెను.

విష్ణువు శివపూజకు అర్చకు డయ్యెను

త్రిపురవధకాలమందు శివుని చేతిలో బాణముగ నుండెను.

సహస్రకమ లార్చన పూర్తికొఱకు విష్ణువు శివుని పాదములందు నేత్రమును సమర్పించెను.

విష్ణువు శివుని అర్ధశరీరమును కోరుకొని అర్ధాంగిగా నుండెను.

విష్ణువు పార్వతితో సరిగా శివునికి భార్యగా నుండవలెనని గంగ యయ్యెను.

ఒకప్పుడు ఋషుల భార్యలు శివుని అందమును చూచి మోహచిత్తులై శివుని వెంట పోవుచుండిరి. అపుడు ఋషులకు కోపము వచ్చి "నీ లింగము (గుహ్యేంద్రియము) పడిపోయి నపుంసకుడ వగుదువుగాక" యని శివుని శపించిరి. వెంటనే లింగము పడి క్రమముగా భూమి మొదలుకొని పైలోకముల వరకు పెరిగిపోవుచుండెను. అపుడు దేవతలు భయపడి ప్రార్థనచేయగా "విష్ణువు లింగము నుంచుటకు పాను మట్టమైనచో చిన్న లింగ మగుదు" నని శివుడు చెప్పగా అప్పటినుండి విష్ణువు పానుమట్టముగ నుండెను.

దక్షయజ్ఞ సమయములో శివుడు విష్ణువు యొక్క చేతులను, కాళ్లను నరికి శూలముతో పొడిచి గిరగిర త్రిప్పి దూరముగా పార వేసెను. అందువలన విష్ణువు జగన్నాథ క్షేత్రములో చేతులు కాళ్లును లేకుండ పూజింపబడు చుండెను.

"విష్ణో రేక సహస్రాణి ఫల మేకం మహేశ్వరమ్"

తా. వేయి విష్ణువుల ఆయుర్దాయము గడచినచో శివునకు ఒక రెప్పపాటుకాల మగును.

శ్లో. బ్రహ్మస్థానే కృతం పాపం విష్ణుస్థానే వినశ్యతి
విష్ణుస్థానే కృతం పాపం శివస్థానే వినశ్యతి

తా. బ్రహ్మదేవుని దగ్గర చేసిన పాపము విష్ణుదేవుని ఆశ్రయించి యుండిన పోవును. విష్ణువు దగ్గర చేసినపాపము శివుని ఆశ్రయించి యుండిన నశించును. గాన విష్ణువు కంటే శివుడే అధికుడని తెలియుచున్నది.

శ్రీరాముడు ఒరిస్సా రాష్ట్రములో గుప్తేశ్వర లింగమును, హంపి విజయనగర మందు సుగ్రీవుడు పూజించి వరము నొందిన శివలింగమును, రామేశ్వరములో శివలింగ మును పూజించి వరముల నొందెను. పాపములను పోగొట్టుకొనెను. శివుడు రామునకు విశ్వరూపమును చూపెను.

ఉపమన్యు డను ఋషి శ్రీకృష్ణునకు, "ఓం నమశ్శి వాయ" అని మంత్రోపదేశము చేసెను.

శ్లో. సర్వదేవాత్మకో రుద్ర స్సర్వే దేవా శ్శివాత్మకాః
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిః బ్రహ్మాత్రయో౽గ్నయః
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుః సోమో౽పి తే త్రయః

తా. శివుడు సర్వదేవతా స్వరూపుడు. దేవత లందరున్ను రుద్రుని రూపులే. శివునియొక్క కుడిప్రక్కన సూర్యుడు, బ్రహ్మ, అగ్ని దేవుడు నుందురు. శివుని ఎడమవైపున పార్వతి, విష్ణువు, చంద్రుడు నుందురు. ( రుద్రహృదయోపని షత్తు )

శ్రీకృష్ణుడు పార్వతీ పరమేశ్వరులను సేవించగా శివుడు ఎనిమిది వరములను, పార్వతి ఎనిమిది వరములను ప్రసా దించెను. ( భారతము )

శ్రీకృష్ణుడు పార్వతీదేవికి వినాయకుడుగా పుట్టెను. (వినాయక చరిత్ర)

లక్ష్మీదేవి శివుని ఒక సంవత్సరము పూజించవలెనని వ్రతముబూని ప్రతిదినమును ఒక చెరువునకుపోయి తామర పుష్పములను గొనివచ్చి పూజచేయుచుండెడిది. సంవత్సరాంతమున రెండు పుష్పములు తక్కువకాగా తన స్తనమును కోసి శివునికి సమర్పించి రెండవ స్తనమునుకూడ కోయబోవగా శివుడు ప్రత్యక్షమై "నీభక్తికి మెచ్చితిని నీవు కోసి యిచ్చిన స్తనమును శాశ్వత కీర్తి గలుగునట్లు నాకు ప్రియమైన మారేడువృక్షముగా చేసెద"నని చెప్పి చేసెను. మారేడు దళములు శివునికి ప్రియములైనవి.

దూర్వాసుడు శ్రీకృష్ణునకు క్రోధ మున్నదో లేదో తెలిసికొనుటకు గాను ఒకనాడు రుక్మిణీదేవిని రథమునకు కట్టి రథమును లాగు మని కొట్టుచు రథమును లాగించెను. అపుడు శ్రీకృష్ణునకు కోపమును, రుక్మిణీదేవికి కష్టమును కలుగనందున శ్రీకృష్ణ రుక్మిణీ దేవులకు దూర్వాసుడు వరముల నిచ్చెను. దూర్వాసుడు అనసూయకు పుట్టిన శ్రీకంఠరుద్రుడు. దూర్వాసునకు కౌశికుడు, కాశ్యపుడు, అగస్త్యుడు, భరద్వాజుడు, గౌతముడును పుట్టిరి.

## పంచవిధ శైవ మతస్థులు

1. అనాదిశైవులు—శివుడు, గణపతి మొదలగువారు.

2. ఆదిశైవులు—దేవాలయములందు శివుని పూజించే ఆది శైవ ద్రావిడ బ్రాహ్మణ అర్చకులు.

3. మహాశైవులు—త్రైలింగ బ్రాహ్మణులు.

4. అనుశైవులు—క్షత్రియ, వైశ్యులు.

5. వీరశైవులు—లింగధారణ జేయునట్టి శూద్రులు.

## శైవుల విశ్వాసము

"అత్యంత పాపకర్మాణి శివభక్త్యా విశుద్ధ్యతి"

తా. మహా పాపకర్మలజేసిన వారైనను శివునిపై భక్తిగల వారైనచో పరిశుద్ధు లగుదురు.

శ్లో. శివనామైవ సంసార మహారోగైక శామకమ్
నాన్య త్సంసార రోగస్య శామకం దృశ్యతే మయా

తా. శివనామ మొక్కటే సంసారదుఃఖ మనెడి రోగమును నశింపజేయున దగును. అట్లు సంసార రోగమును శమింపజేయునట్టి మరొక టేదియు నాచే చూడబడలేదు.

శ్లో. శివప్రసాదేన వినా నసిద్ధి శ్శివప్రసాదేన వినా నబుద్ధిః
శివప్రసాదేన వినా నయుక్తి శ్శివప్రసాదేన వినా నముక్తిః

తా. శివుని అనుగ్రహము లేకుండ నేదియు సిద్ధింపదు. శివుని కృపలేనిదే మంచిబుద్ధి గలుగదు. శివుని దయలేనిదే యోగము గలుగదు. శివుని కనికరములేకుండ మోక్షము సిద్ధించదు.

శ్లో. శివార్చన విహీనో యః పశురేవ నసంశయః
సతు సంసార చక్రేస్మి మజస్రం పరివర్తతే

తా. శివుని పూజించని వారు నిస్సంశయముగా పశువుతో సములు. అట్టివారు నిరంతరమును సంసార చక్రములో తిరుగుచు బాధలు పడెదరు.

శ్లో. అసారే ఖలు సంసారే సారమేత చ్చతుష్టయమ్
కాశ్యాంవా సస్సతాం సంగో గంగాభ శ్శంభు పూజనమ్

తా. సారములేని ఈ సంసారములో (లోకములో) నాలుగు మాత్రమే సారమైనవి. అవేవి యనగా:

1. కాశీ నివాసము. 2. సజ్జన సాంగత్యము. 3. గంగా స్నానము 4. శివుని పూజించుటయు నగును.

"శివప్రసాదే నహి భుక్తి రుత్తమా శివప్రసాదే నహి ముక్తి రుత్తమా"

తా. శివుని అనుగ్రహము లేనిదే భుక్తి గలుగదు, ముక్తియు గలుగదు.

## మహాదేవి ఆధిక్యత

ప్రశ్న: స్వామీ! త్రిమూర్త్యాది దేవతల కంటె దేవి గొప్ప దనియు, దేవీధ్యానము పూజయు అన్నివిధముల శుభ ప్రదమనియును చెప్పుచుందురు. నిజమేనా?

సమా: దేవీ భాగవతములో దేవీ ప్రభావము విపుల ముగా నుండును. దేవీ పూజచేసి అనేకులు ఇష్టసిద్ధులను బడసిరి.

శ్లో. చతుర్యుగ సహస్రాణి దినమేకం పితామహమ్
పితామహ సహస్రాణి విష్ణోర్ఘటిక మేవచ
విష్ణో రేక సహస్రాణి ఫలమేకం మహేశ్వరం
మహేశ్వర సహస్రాణి శక్తి రర్ధ ఫలం భవేత్

తా. వెయ్యి చతు ర్యుగములు బ్రహ్మదేవునికి ఒక దిన మగును. వెయ్యి బ్రహ్మలు గడిచిన విష్ణువున కొక ఘడియ యగును. వేయి విష్ణువులు గడిచిన మహేశ్వరున కొక రెప్పపాటుకాల మగును. వేయి ఈశ్వరులు గడిచిన దేవికి అర్థరెప్పపాటుకాల మగును.

పై శ్లోకము వలన దేవి గొప్పదని తెలియుచున్నది గదా! పురుషులు దేవిని భజించిన యెడల కొన్ని ప్రమాదములు కలుగవచ్చునని చెప్పుచుందురు. దేవిని తల్లి భావనతోగాని, పరబ్రహ్మస్వరూపిణియను భావనతోగాని ధ్యానించుచుండువారికి మాత్రము ప్రమాద మేమియు సంభవింపదు.

ఒక ఊరిలో ఒక దేవీ ఉపాసనాపరుడు దేవి ప్రత్యక్షమైనపుడు కామవికారముతో పట్టుకొనబోవగా ఆమె నెత్తిన కొట్టి మాయమైపోయెను. అప్పటినుండి ఆ భక్తుడు అనారోగ్యవంతుడై మరణించెను.

ఒక గ్రామములో ఒక ధనవంతునికి అందరున్ను కుంటివారుగానే సంతానము గలిగిరి. ఒక మహాత్ముడు ఆ కుంటి సంతానమును గురించి "పూర్వజన్మలో వీరు దేవీ ఉపాసన తప్పుగా చేసినందుకు కుంటివారుగా బుట్టి"రని

చెప్పెను పండ్రెండు సంవత్సరముల వయస్సు లోపలనే ఆ కుంటి పిల్లలు చనిపోయిరి.

ఒకప్పుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు "నేనెక్కువంటే నేనెక్కువ" యనుకొనుచు విశేషముగా కలహించుకొనుచుండిరి. అప్పుడు మహాదేవికి తెలిసి "త్రిమూర్తులను నా దగ్గరకు తీసికొని రమ్ము" అనుచు చెలికత్తెను పంపినది. అపుడు చెలికత్తె అనేక బ్రహ్మాండములను దాటుచు దిగివచ్చి త్రిమూర్తులను చూచి "మీ తల్లి మీ ముమ్వరను తీసికొని రావలసినదని నన్ను పంపిన"దని చెప్పెను. అపుడు "మాకొక తల్లి కూడ కలదా" అనుకొనుచు చెలికత్తె వెంట వచ్చుచు ఒక్కొక్క బ్రహ్మాండమును అచట గల త్రిమూర్తులను గాంచుచు అనేక బ్రహ్మాండములను దాటి, మహాదేవి దగ్గరకు వెళ్లిరి. అప్పుడు వారిపై కోపము చూపుచు "మీరు ముగ్గురును కలహించుకొనక, నా యాజ్ఞప్రకారము మీ మీ పదవులకు తగిన నియమములను తప్పక పాటించుచుండవలెను" అని చెప్పెను. అంత త్రిమూర్తులు దేవి సెలవు తీసికొని దిగివచ్చుచు బ్రహ్మాండములను, ఒక్కొక్క బ్రహ్మాండములో గల త్రిమూర్తులను చూచుచు ఆశ్చర్యము జెందుచు "మేమే బ్రహ్మాండముల కన్నిటికిని కర్తల"మను అభిమానమును చంపుకొని శాంతిగా నుండిరి.

ఒకనాడు శ్రీకృష్ణుడు ఎంత వెదకినను తన కుమారుడు కనబడనందున దుఃఖపడుచు దేవిని ప్రార్థన చేసెను. అపుడు దేవి ప్రత్యక్షమై "నీ కుమారుని శంబరాసురుడు తీసికొని పోయె"నని చెప్పెను. వెంటనే శ్రీకృష్ణుడు

శంబరాసురుని గనుగొని వానిని చంపి తన కుమారుని తెచ్చుకొనెను.

పాండవులు అరణ్యావాసమును పూర్తి చేసికొని అజ్ఞాత వాసము చేయుటకు విరాటరాజునగరమునకు వెళ్లుచు దేవిని ప్రార్థన చేసిరి. అప్పుడు దేవి ప్రత్యక్షమై అజ్ఞాతవాసము పూర్తియగువరకును ఇతరులకు తెలియక నుండునట్లు వరము నిచ్చి అదృశ్యమయ్యెను.

శ్రీ శంకరాచార్యులు ఒకప్పుడు దేవియనునది లేదని, శాక్తేయులతో వాదము చేసెను. అందుకు దేవికి కోపము వచ్చినందున ఒకనాడు శంకరులు శిష్యులను వెంటబెట్టుకొని వెళ్లుచుండగా పెద్ద పెనుగాలిని రప్పించెను. ఆ గాలికి శిష్యులు చాలాదూరము కొట్టుకపోయిరి. శంకరులు బురద గుంటలో పడిపోయి బైటకు రాజాలక "నాపై యే దేవత కోపము చూపెనో" యనుకొనుచు దుఃఖపడు చుండెను. కొంతసేపటికి దేవి వృద్ధురాలి వేషము ధరించి కఱ్ఱను ఆధారముగా జేసికొని, శంకరుల ముందుగా నడచు చుండగా శంకరులు కేకేలువేసి తన అవస్థను చెప్పి ఆ ముసలమ్మను "చేతికఱ్ఱ నియ్యవలసినదనియు బురదలోనుండి బైటకువచ్చిన తరువాత నీ కఱ్ఱ నీ కిచ్చెద"ననియు బ్రతిమాలెను. అపుడు వృద్ధ వనితగా యున్న దేవి "నీవు యువకుడవు నిన్ను నమ్మగూడదు. నా కఱ్ఱను యిచ్చినచో తిరిగి యిచ్చెదవో నీయవో" అనెను. అపుడు శంకరులు "తల్లీ, నేను బురదనుండి బైటకురాగానే నీ కఱ్ఱ నీ కిచ్చి వేసెద"నని చెప్పగా, దేవి చేతికఱ్ఱ నిచ్చెను. దాని

సహాయముతో బైటకువచ్చి ముసలమ్మకు కఱ్ఱ నిచ్చివేసెను. దేవి శంకరులకు తన నిజరూపమును చూపి "దేవి యనునది లేనే లేదని నా భక్తులతో వాదించినావు గదా! అందుకే నీ కీ ప్రాయశ్చిత్తమును విధించితి"నని చెప్పెను. అపుడు శంకరులు క్షమాపణ వేడుకొనెను. తరువాత ఎవరి దారిని వారు వెళ్లిపోయిరి. శంకరులు తన పీఠమునకు 'శారదా పీఠ'మని పేరుపెట్టుకొనెను.

శ్రీ కాళిదాసు కాళికాభక్తుడే గదా! శ్రీ రామకృష్ణపరమహంసగారు కలకత్తాలో శ్రీ కాళికాదేవిని పూజించి, స్మరించి, ధ్యానించి భక్తి జ్ఞానవైరాగ్యములతో పరిపూర్ణ పరబ్రహ్మానుభూతుడై లోకోద్ధారణ గావించెను గదా!

శ్రీ విద్యారణ్యస్వాములవారు శ్రీ లక్ష్మీదేవిని ఉపాసించెను.

భక్త పోతనామాత్యుని గృహమునకు శ్రీనాథుడు పరివారసమేతుడై వచ్చినపుడు సరస్వతీదేవియే సమస్త ఆహారపదార్థములను సృజించి ఇచ్చెను.

పోతన భార్య శ్రీనాథుని గృహమునకు వెళ్లుటకు ప్రయాణము గాబోవు ముందు రుక్మిణీదేవి చక్కని చీరలను వివిధరకములైన నగలను పెట్టెలో నుండునట్లు చేసెను. ఆ చీరలను, నగలను ధరించి పోతన భార్య శ్రీనాథుని గృహమున జరుగు విందునకు వెళ్లెను. అపుడు శ్రీనాథుడు కడు దరిద్రుడైన పోతనకు ఈ చీరలు, నగలున్న ఎట్లు లభించినవి! అని తలంచుచు పోతన దగ్గరకు వచ్చి అడిగెను.

అపుడు పోతన "నా కేమియు తెలియదు. నేను గ్రంథమును వ్రాసికొనుచుంటిని" అని బదులు చెప్పెను. ఇది దేవీకృపా కటాక్షఫలితమే నని శ్రీనాథుడు నిశ్చయించుకొని వచ్చిన దారిని వెళ్లెను.

శ్లో. యా కుందేందుతుషారహారధవళా
యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండమండితకరా
యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుతశంకరప్రభృతిభిః
దేవైః సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ
నిశ్శేషజాడ్యాపహా.

తా. ఏ దేవి తెల్లని హారమును, శుభ్రమైన వస్త్రమును ధరించినదో, ఏ తల్లి వీణ ధరించి తెల్లని ఆసనముపై కూర్చొనినదో, ఏ మాత బ్రహ్మ, విష్ణు, శివుడు, ఇంద్రుడు మొదలగువారిచే ఎల్లప్పుడును పూజింపబడుచుండునో అట్టి సరస్వతి, భగవతి నన్ను రక్షించునుగాక. అజ్ఞానరోగమును పోగొట్టును గాక.

సీ. తన రజోగుణముచేఁ దనరంగ నే దేవి
గల్పించు నఖిల లోకముల నెల్ల
దన సత్త్వగుణముచే నొనరంగ నే కొమ్మ
పోషించు నీ సర్వభూతములను

దన తమోగుణముచేఁ దగ నే వధూమణి
జగముల నెల్ల సంక్షయము జేయు
దా శుద్ధ సత్త్వ ప్రధానయై యే రామ
రామాంకమున నజస్రము వసించు
తే. నట్టి భువనైకమాత దయాసమేత
సద్గుణవ్రాత నిర్మలస్వాంత పూత
భక్తజనమానసోద్యాన పారిజాత
సీత కరుణించి నన్ను రక్షించుగాత.

## దేవి శివుని గర్వ మణచుట

ఒకనాడు శివుడు పార్వతిని చూచి "గిరిజా, పదునాలుగు లోకము లందును నేనే. శ్రేష్ఠుడను. సర్వమును సృష్టించి పాలించి, సంహారింపజేయువాడను నేనే నా త్రిగుణములవలన. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లను మూడు రూపముల దాల్చి యుందును. భక్తులకు, తాపసులకు, రాక్షసులకును వరము లిచ్చుచుందును. నేను ఒకప్పుడు ఐదు ముఖములును, మరి యొకప్పుడు ఏక ముఖమును ధరించియుందును. విషమును భక్షించి లోకములను రక్షించితిని. ఎల్లప్పుడు దిగంబరిగా సంచరించుచుందును" అనెను.

అప్పుడు పార్వతి పరమేశ్వరుని గర్వమును భంగము చేయదలచినదై తన చేతితో కొంత మన్ను తీసి, బంతివలె గుండ్రముగా జేసి, దానిపైన నవరత్నమును స్థాపించి, బహురమ్యముగా తయారుచేసి, భర్తచేతి కిచ్చి చిత్తగింపు మనెను.

దానిని శివుడుచూచి ఆశ్చర్యపరవశుడై, త్రిప్పి త్రిప్పి చూచు చుండగా నందొక చోట, చిన్న ద్వారము, దానిలో పెద్దతోట, దానియందు పలువిధములగు వృక్షములు, వింతయైన ఫలములతోను, పుష్పములతో నొప్పారు చున్నటుల తనయెదుట కనబడెను. వాని వెనుక పద్మములు, కలువలు, వింత వింత పక్షులుగల సరోవరములను చూచి ఆశ్చర్య నిమగ్న హృదయు డయ్యెను. పిమ్మట దాని యందలి యింకొక ద్వారమున జూడగా నందు పది ముఖములు, నరువది బాహువులు గలిగి తనవలె జడలు, నాయుధములు, నాగాభరణములు గల్గి ప్రకృతే (దేవియే) గొప్పదని యరచుచున్న యింకొక శివునిజూచి సిగ్గుపడెను. ఇంకొక ద్వారమున చూడగా దివ్యభవనమున గొప్ప నవ రత్న సింహాసనమున కూర్చుండియున్న దివ్య మంగళ విగ్రహముగల దేవిని, యామె యెదుట నాట్యము చేయు చున్న తనవంటి శివుని, నామె కుభయ పార్శ్వములందును నిలిచియుండి స్తోత్రము చేయుచున్న బ్రహ్మ విష్ణువులను చూచి మైమరచెను. ఇదంతయు చూచి ఈశ్వరు డిట్లు చింతించెను. "నేనే గొప్పవాడననియు, నా కంటె వేరు లేరనియు తలంచి గర్వించితిని. నే నెంత బేలను! ప్రకృతియే (దేవియే) గొప్పది" అని, దేవీరూపమును, మనసార ధ్యానించి, స్తోత్రముచేసి, నేత్రములు తెరచి చూడగా పార్వతితప్ప మరేమియు నచట కనబడకుండెను.

# దేవియన నెవరు?

(శివానంద శిష్యః)

ఆమెయే వేదాంతులకు పరబ్రహ్మ, వైష్ణవులకు మహావిష్ణువు, శైవులకు పరమశివ, క్రైస్తవులకు స్వర్గలోక మందుండు తండ్రి, మహమ్మదీయులకు అల్లా, బుద్ధుని నిర్వాణము, యూదుల జెహోవా, జొరేష్ట్రియనుల అహుర మజాదా. ఆమె మూలప్రకృతి యనికూడ పిలువబడును.

ఆ మహాదేవి పరాశక్తి, దుర్గ, త్రిపురసుందరి, లలిత, రాజేశ్వరి, శక్తి, సరస్వతి, మహాలక్ష్మి, ఉమ, సావిత్రి, హైమవతి మొదలగు పేర్లతో పిలువబడును.

పంచభూతములు, విద్యుచ్ఛక్తియు ఆ పరాశక్తి రూపములే. ప్రాణము పరాశక్తియొక్క మార్పు, మనస్సు చిచ్ఛక్తియొక్క మార్పు. ఈమెయే జగన్మాతగా ప్రజలకు అవసరమైన శక్తుల నిచ్చి వారిని పెద్దవారినిగా జేయును. విజ్ఞానశాస్త్రములన్నియు ఆమెవల్లనే యుద్భవించినవి.

శరీరము, ప్రాణము, ఇంద్రియములన్నియు, ఆమె రూపములే. ఆమెయే మన అవిద్యను తొలగించి ముక్తి గలుగజేయును.

అమ్మ శక్తి రెండు విధములు: 1. జడశక్తి, 2. శుద్ధమాయ. జడశక్తినే ప్రకృతి యందురు. శుద్ధమాయ చిచ్ఛక్తి యందురు. ఉమాహైమవతీ జ్ఞాన స్వరూపు రాలు. ఆమె మూడు గుణములకు కారణభూతురాలు. ఆ గుణములబట్టి ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి రూప

ములుగా నుండును. బ్రహ్మశక్తి, విష్ణుశక్తి, శివశక్తి, ఈమూడు రూపములుగా నుండుటవల్ల త్రిపురసుందరి యను నామము గలిగినది.

ఈమె మాయగా నుండి శరీరమందు సుఖ దుఃఖముల గలిగించుచుండును. ఆ విద్య రూపిణిగా నుండి ఈ శరీరమే తాను అను భ్రాంతికలుగ జేయును.

ప్రకృతి యొక్క ముఖ్య రూపములు:

1. రాధ, 2. దుర్గ, 3. లక్ష్మి, 4. సరస్వతి, 5. శక్తి

ఆమె దుర్గ రూపముతో మధుకైటభులను రాక్షసులను సంహరించెను. ఆ రోజు దుర్గాష్టమి యని పేరు. మహాలక్ష్మి స్వరూపముతో మహిషాసురుని చంపెను. ఆ రోజు మహర్నవమి యని పేరు. సరస్వతీ స్వరూపముతో శుంభ, నిశుంభ, ధూమ్రాక్ష, చండ, ముండ, రక్తబీజుల పీచ మడంచెను. ఈ దినమే విజయదశమి యనబడుచున్నది.

మనశరీరమందు దేవి కుండలిని రూపముగా వసించును.

కూర్మ పురాణమందు దేవీనామ సంకీర్తన వల్ల పాపములన్నియు నశించునని చెప్పబడినది.

బ్రహ్మ పురాణమునందు దేవిని ఆరాధించినచో సంసార బంధమునుండి విముక్తులగుదురని చెప్పబడినది.

శ్రీ శంకరాచార్యులవారు దేవిని ఆనందలహరి, సౌందర్యలహరిలందు ఎక్కువగా స్తోత్రము చేసియున్నారు.

అవిద్యను తొలగించి విద్యను ప్రసాదించగల శక్తి ఆ మహాతల్లికి గలదు. ఆధ్యాత్మిక విద్యయందు ఉత్తీర్ణు

లగుటకు ప్రయత్నించు ప్రతి మనుజుడు ఆమెను ఉపాసన చేయవలెను.

కొందరు శాక్తేయులు (అనగా దేవీపూజ చేయు మతస్థులు) మకార పంచకమందు అనగా మత్స్య, మాంస, మదిర, ముద్ర మైధునము లందు ఆమెకు ప్రీతియని పై వాటి యందు ఆసక్తులై ఆ పనులు చేయుచు దేవీపూజయొక్క పవిత్రత పాడుచేయు చున్నారు. వారు వాటి యందలి అంతరార్థమును గ్రహింపజాల కున్నారు.

1. మత్స్యమనగా చేపలు తినుట కాదు హింస వదలుట, 2. మాంస మనగా మాంస ఖండమగు శరీరమును స్వాధీన మందుంచుకొనుట, 3. మద్య మనగా త్రాగిన వానివలె భక్తిలో నిమగ్నుడై యుండుట, 4. ముద్ర మైధునములనగా ఈశ్వరుడగు శివునితో ఐక్యమగుట (శివానందవాణి)

శ్లో. ఉమేతికే చిదాహస్తాం శక్తిం లక్ష్మీతి చాపరే
భారతీ త్యపరేచైనాం గిరిజే త్యంబికేతిచ.

శ్లో. దుర్గేతి భద్రకాళీతి చండీ మాహేశ్వరీతి చ
కౌమారీ వైష్ణవీ చేతి వారాహ్యైంద్రీతి చాపరే

శ్లో. బ్రాహ్మీతి విద్యాఽవిద్యేతి మాయేతిచ తథాపరే
ప్రకృతిశ్చపరాచేతి వదంతి పరమర్షయః

శ్లో. సేయం శక్తిః పరావిష్ణోః జగత్సర్గాధికారిణీ
వ్యక్తావ్యక్త స్వరూపేణ జగద్వ్యాప్యవ్యవస్థితా.

శ్లో. ప్రకృతిశ్చ పుమాంశ్చైవ కాలశ్చేతి త్రిధాస్థితా
సృష్టిస్థితి వినాశానా మేకా కారణతాంగతా.

శా. ఆ మహాదేవిని ఉమయని, లక్ష్మియని, భారతి యని, గిరిజయని, అంబికయని, దుర్గయని, భద్రకాళియని, చండియని, మాహేశ్వరియని, కౌమారియని, వైష్ణవియని, వారాహియని, ఇంద్రియని, బ్రాహ్మియని, విద్యయని, అవిద్యయని, మాయయని, ప్రకృతియనియు చెప్పెదరు. పరమ ఋషులు పరా యనెదరు.

ఇట్టి పేర్లు గల శక్తియే జగత్సృష్టి, స్థితి, లయ కార్యములు చేయునదిగను, కనబడునదిగను, కనబడనిది గను అగు రూపముతో జగత్తును వ్యాపించుకొని యున్నది.

ఇదే పరాశక్తి. అదే ప్రకృతియనియును, పురుషు డనియును, కాలమనియును మూడు విధములుగా నున్నది. అదియే సృష్టికి, స్థితికి, నాశమునకును కారణముగ నున్నది.

సమస్త జీవరాసులలోను

1. శ్రీహరి ఆత్మగాను
2. ఈశ్వరుడు జ్ఞానముగాను
3. దుర్గాదేవి బుద్ధిగాను
4. బ్రహ్మ మనస్సుగాను
5. దేవతలు ఇంద్రియములుగాను

యుంటున్నారు (బ్రహ్మవైవర్తపురాణము)

## గాయత్రీదేవి సాక్షాత్కార మొందిన భక్తుడు

ఒకనాడు అక్బరు చక్రవర్తి, మంత్రియగు బీర్బలున్నూ మారువేషాలతో తమ ఢిల్లీ పట్టణమును పరిశీలించి చూచు

టకు వెళ్లగా ఒక బ్రాహ్మణుడు భిక్షమెత్తుకొనుట అక్బరు చూచి మంత్రితో "ఇదేనా! మీ ఉత్తమ బ్రాహ్మణుల స్థితి" అని ఆక్షేపించగా, మంత్రి బ్రాహ్మణునితో "నీ వెందుకు బిచ్చమెత్తు" చున్నావని అడుగగా, "తిండిలేక, కుటుంబములో జరుగక పోవుటచేత"యని చెప్పగా,

"గాయత్రీ మంత్రమును జపముచేయుచు ఇంటిదగ్గరనే యుండుము. నీకు మూడు లేక నాలుగు అణాలు పంపెద"నని చెప్పగా సంతోషముతో గాయత్రీమంత్రజపము చేసి కొనుచు నుండెను. కొంత కాల మైనతరువాత "వెయ్యి రూపాయలు పంపెద"నని మంత్రి చెప్పెను.

ఒకనాడు బ్రాహ్మణునకు గాయత్రీదేవి ప్రత్యక్షమై "గాయత్రిని వ్యాపారముగా తలంచితివా"యని ప్రశ్నించెను. అప్పటి నుండి మంత్రియిచ్చే డబ్బును తీసికొనక నిష్కామ బుద్ధితో జపము చేయుచు నుండెను. అనేకమంది భక్తులు వచ్చి బ్రాహ్మణునకు ధనధాన్యాదుల నిచ్చి పోవుచుండిరి.

## పార్వతీదేవి కాపాడిన ఆంగ్ల భక్తుడు

తూర్పు ఇండియా కంపెనీకాలంలో భవానిపట్టణం సేలం, కోయంబత్తూరు జిల్లాలకు ముఖ్యపట్టణంగా వుంది. భవాని అతిసుందరమైన పకృతితో శోభిల్లుతోంది. కావేరి, భవాని నదులు అక్కడ ప్రవహిస్తున్నాయి. అక్కడ సంగమేశ్వరుడు, వారి అర్థాంగి వేదనాయకిల దేవాలయం వుంది. అతి ప్రాచీనకాలంనుండి ఈక్షేత్రం ప్రసిద్ధిచెంది వుంది. క్షేత్రపురాణంలో ఈ రెండు నదులే కాక భూగర్భంలో

అమృతవాహిని ప్రవహిస్తూ ఈ రెండునదుల సంగమంలో వచ్చి కలుస్తోందని వర్ణించబడి వుంది. ఈ క్షేత్రానికి 'పరాశర క్షేత్రం' అని కూడా పేరు. ఈ క్షేత్రంలోని దేవి వేదనాయకిని గురించి అద్భుతమైన కథలు వున్నాయి. కల్పన కంటే సత్యమే అద్భుతావహమైందని ఈ కథలు రుజువు చేస్తున్నాయి. దైవమహిమలు కాలంతో పరిమితం కాకుండా ఎల్లప్పుడూ సంభవిస్తూ వుంటాయి.

తూర్పు ఇండియా కంపెనీ కాలంలో విలియంగారో జిల్లాకలక్టరుగా భవానికి నియమితు డయ్యాడు. కలక్టరు బంగళా దేవాలయానికి ఆనుకునే వుంది. దేశీయులు వేదనాయకి యెడల చూపుతున్న భక్త కలక్టరుగారి మనస్సును ఆకర్షించింది. నిరంతరం భక్తిప్రవాహం గుడికి రావటం నిత్యమూ చూస్తున్నాడు. ఆ ఆకర్షణ అతని హృదయంలో పెరిగి పెరిగి సజీవభక్తిగా పరిణతిచెంది దేవిని ప్రత్యక్షంగా ఆరాధించాలనే తపన బయలుదేరింది. కాని ఆరోజుల్లో హిందువులు కానివారు ఆలయంలోనికి ప్రవేశించరాదు. ఈ సనాతన ఆచారం విలియంగారోను నిరోధించింది దేవిని అర్చించనీయకుండా. బుద్ధిమంతుడైన ఆంగ్లేయుడు తన మేడ రెండవ అంతస్తు వరండాలోనే నిలబడి దేవాలయం వైపుకు తిరిగి హృదయంలోనే ఆ జగజ్జననిని, సర్వమంగళను అర్చించి సంతృప్తి చెందవలసి వచ్చింది.

ఆంగ్లేయుడు మేడ పైభాగంనుండి ముకుళిత హస్తుడై, కన్నీటితో మహాభక్తితో మునిగిపోవటం రోజూ చూస్తున్న దేవాలయ అధికారులను అశ్చర్యంలో ముంచె

త్తింది. వారందరు సమావేశమై గారోకు సులభంగా దేవి దర్శనం కలిగించటానికై చర్చించి ఈ ఉపాయాన్ని కనుగొన్నారు. ఆలయ బహిఃప్రాకారంనుండి గర్భగుడికి రెండు అంగుళాల రంధ్రాన్ని తొలచారు. దేవిదర్శనం గారోకు కలిగేట్టు చేశారు. కలక్టరు ప్రతిరోజు సాయంత్రం ఆ రంధ్రం నుండే దేవిని దర్శించేవాడు. ఆ దర్శనం, ఆ దేవిని గురించిన కథలు గారో హృదయంపై గాఢమైన ముద్రలు వేశాయి.

1804 ఒక వేసవికాలం రోజున భాస్కరుడు మండి పోతున్నాడు. ఆ మధ్యాహ్నం గారో విశ్రాంతికై పండుకొన్నాడు. ఇంతలో నిద్రపట్టింది. హఠాత్తుగా కలక్టరు త్రుల్లి పడి లేచి బంగళానుండి బయటకు పరిగెత్తాడు. స్వప్నంలో వేదనాయకి దర్శనమై గారోను తక్షణమే బంగళానుండి బయటపడమని చెప్పింది. గారో బాణం మాదిరి బయటకు వచ్చిపడి వెనుతిరిగి చూశాడు. బ్రహ్మాండమైన మోతతో బంగళా ఒక్కసారిగా కూలిపోయింది. ఒక్క క్షణంలో బంగళా రాళ్లగుట్టగా మారిపోయింది. ధూళి ఆలయ శిఖరాన్ని క్రమ్మివేసింది.

బంగళా క్రొత్తగా గట్టిగా కట్టినది. ఆశ్చర్యం! అకారణంగా బంగళా కూలిపోయింది.

గారో ఆనందంతో మిన్నందుకున్నాడు. తన ఇష్ట దైవం వేదనాయకి తన్ను రక్షించిందని ఆ మహాతల్లి తన యెడల చూపిన వాత్సల్యానికి ప్రతిగా బంగారంతో పొదిగిన దంతం ఉయ్యాలను బహూకరించి తన భక్తి ప్రపత్తుల్ని

తెలుపుకున్నాడు. ఈ కానుక ఇప్పటికీ దేవాలయంలో భద్ర పరచబడీ వుంది.

## సర్వమత సమన్వయము

కథ : ఒక నాడొక ప్రదేశమునందు అన్ని మతములలో నుండెడి పెద్దలు చేరి మతచర్చ చేయుచుండిరి. అప్పుడు శివమతస్థుడు శివుడే దేవు డనియు, శివునికంటె నితర దేవతల నారాధించువారు పాపకూపమున బడెద రనియు, విష్ణుమతస్థుడు శ్రీమహావిష్ణువే భగవంతు డనియు, శాక్తేయ మతస్థుడు శక్తియే ( దేవియే ) సృష్టి స్థితి లయ కారణభూతురాలనియు, సౌరమతస్థులు సూర్యుడే దేవు డనియు, క్రైస్తవమతస్థుడు యేసు కంటె నన్యదైవములే డనియు, —నిట్లందరు వాదించుకొనుచుండిరి.

అప్పు డొక జ్ఞాని వారి యజ్ఞానమును గ్రహించి శివ మతస్థునితో "నీవు శివుని నిజరూపము చూచితివా?" యనెను. విష్ణుమతస్థుని "నీవు విష్ణువు యొక్క యథార్థ స్వరూపమును గాంచితివా?" యనెను. శాక్తేయుని చూచి "నీవు శక్తియొక్క సత్తు చిత్తు ఆనంద స్వరూపములను అనుభవమునకు తెచ్చుకొంటివా?" యనెను. సౌరమతస్థుని చూచి "నీవు సూర్యుని యొక్క అప్రాకృత స్వరూపమును గనుగొంటివా?" యనెను. క్రైస్తవమతస్థుని చూచి "నీవు క్రీస్తు దేవుని యొక్క అనంతానంద అద్వైత స్వరూపమును చూచితివా?" యనెను. ఇట్లు అన్ని మతస్థులవారిని ప్రశ్నింపనం దొక్కరును తాము చూచియుండలే దని చెప్పిరి.

అప్పుడు ఆ మహాత్ముడు "నిజముగ భగవత్స్వరూపమును చూచినవారికి నెట్టి వివాదము లుండ"వని చెప్పి వారి వివాదములను మాన్పెను.

## శ్రీహరి దశావతారములు

శ్లో. మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బౌద్ధః కల్కి రేవచ

## ద్వాదశ జ్యోతిర్లింగములు

శ్లో. సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీశైలే మల్లికార్జునమ్
ఉజ్జయిన్యాం మహాకాళం ఓంకార మమలేశ్వరం
పరల్యాం వైద్యనాథంచ ఢాకిన్యాం భీమశంకరమ్
సేతుబంధేతు రామేశం నాగేశం దారుకావనే
వారణస్యాంతు విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే
హిమాలయేతు కేదారం ఘృష్ణేశంచ శివాలయే
ఏతాని జ్యోతిర్లింగాని సాయంప్రాతః పఠేన్నరః
సప్తజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి.

## అష్టాదశ శక్తుల నిలయము

శ్లో. లంకాయాం శాంకరీదేవి కామాక్షీ కంచికాపురి
ప్రద్యుమ్నే సింహళాదేవి చాముండి కంసపట్టణే
అలంపురే జోగులాంబా శ్రీశైలే భ్రమరాంబికా
కొల్లాపుర్యాం మహాలక్ష్మి మాహూరీయే కవేరికా

ఉజ్జయిన్యాం మహాకాళీ పీఠయాం పురుహూతికా
వోడ్యానే గిరిజా దేవి మాణిక్యాం చిత్రకూటకే
హరిక్షేత్రే కామరూపీ ప్రయాగే మాధవీశ్వరీ
జ్వాలాయాం వైష్ణవీదేవి గయా మాంగల్యగౌరికా
వారణస్యాం విశాలాక్షీ కాశ్మీరేచ సరస్వతీ.

సీ. జందె మింపుగ వేసి, సంధ్య వార్చిన నేమి
బ్రహ్మ మందక కాదు బ్రాహ్మణుండు
తిరుమణి శ్రీచూర్ణ, గురు రేఖ లిడినను
విష్ణు నొందక కాడు వైష్ణవుండు
బూదిని నుదుటను బూసికొనిన నేమి
శంభు నొందక కాడు శైవజనుడు
కాషాయవస్త్రాలు కట్టి కప్పిన నేమి
యాశపోవక కాడు యతివరుండు

తే. ఇట్టి లౌకిక వేషాలు గట్టుకొనిన
గురుని జెందక సన్ముక్తి దొరక బోదు
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస
దుష్ట సంహార నరసింహ దురితదూర.

## జపము, ధ్యానము అననేమి?

( అనుబంధము )

ప్రశ్న: స్వామీ! జప, ధ్యానములను చేయనిదే మనస్సు స్థిరముగా నిలువ దనియు, శాశ్వత మోక్ష సుఖము గలుగ దనియును అనేకులు చెప్పుచుండుట వినుచున్నాను గాని

జప, ధ్యానము లననేమో తెలియజాలక యున్నాను. జప, ధ్యానముల గురించి వివరముగా సెలవిచ్చెదరా?

సమా : సాధారణముగా, అందరున్ను జప, ధ్యానము లను చేయుచునేయున్నారు.

జప మనగా పేరును స్మరించుచుండుట యగును. ధ్యాన మనగా రూపమును చూచుచుండుట యగును.

లోక సంబంధమైన, సంసార సంబంధమైన విషయ ములను స్మరించుచుండుట, చూచుచుండుటయును బంధము గలిగించే జప, ధ్యానము లగును.

దైవ సంబంధమైన, ఆత్మ సంబంధమైన విషయ ములను స్మరించుచుండుట, చూచుచుండుటయును మోక్షము గలిగించే జప, ధ్యానము లనబడును.

## లౌకిక జప, ధ్యానములు

కాముకుడు స్త్రీని జపించును, ధ్యానించును. కాముకు రాలు పురుషుని ధ్యానించుచుండును. క్రోధి శత్రువును ధ్యానించును. మిత్రుడు స్నేహితుని ధ్యానించును. శిష్యుడు గురువును ధ్యానించును. గురువు శిష్యుని ధ్యానించును. బిడ్డలు తల్లిదండ్రులను ధ్యానించెదరు. తల్లిదండ్రులు బిడ్డలను ధ్యానించెదరు. ధనకాంక్షగలవారు ధనమును ధ్యానించెదరు. కీర్తి కాంక్షగలవారు కీర్తిని ధ్యానించెదరు. రోగి తన రోగమును ధ్యానించుచుండును. వ్యవసాయకుడు భూములను, పశువులను, నౌకరులను ధ్యానించుచుండును. వ్యాపారస్థుడు తన దుకాణమును తన వస్తువులను కొను

వారిని ధ్యానించును. వైద్యుడు మందులను, రోగులను, రోగములను ధ్యానించుచుండును. దొంగవాడు రహస్యమార్గములను ధ్యానించుచుండును. ఈవిధముగా లౌకికధ్యానములనేకములుగా గలవు.

## ధర్మ మార్గ ధ్యానములు

ధర్మాత్ములు పరోపకారాది పుణ్యకార్యములు జేయుటయందు శ్రద్ధగలవారై యుందురు.

ధర్మాత్ములు మంచిపనులను చేయుచుండువారిని ధ్యానింతురు. మంచిపనులను ధ్యానించుచుందురు.

ధర్మాత్ములు ధర్మములను బోధించునట్టి గ్రంథములను, గ్రంథములలోని నీతిధర్మములను ధ్యానించుచుందురు.

తాము కష్టపడియైనను, నష్టపడియైనను పరుల క్షేమముకొరకై సదా పాటుపడుచుండవలెనని ధర్మాత్ములు చింతించుచుందురు.

న్యాయముగా సంపాదించుట, దానముచేయుట, సేవ చేయుట, మృదువుగా మాట్లాడుట, నిష్కపటముగా వర్తించుట ఇతరులవలన గలిగిన కష్టనష్టములకు, స్తుతినిందలకును చలించక ఓర్పు గలిగియుండుటయును ధర్మాత్ముల లక్షణము లగును.

## భక్తిమయ ధ్యానములు

భక్తులు దేవాలయములను, శివరామకృష్ణాది దేవతామూర్తులను, పుణ్యనదులను ధ్యానించుచుందురు.

భక్తులు శివ, రామ, కృష్ణ, నారాయణ, సద్గురు మొదలగు నామమంత్రములను కీర్తింతురు, జపింతురు, ధ్యానింతురు.

దేవతా మూర్తులను, సద్గురు మూర్తులను నామములను, శబ్దములను భక్తులు ధ్యానించుచు తన్మయులగుదురు.

భక్తులను, భక్తుల చరిత్రలను, భక్తుల మహిమలను ధ్యానించు చుండువారును భక్తులనబడుదురు.

భగవంతుని సృష్టిలోని తులసి, రావి, మఱ్ఱి, మారేడు, ఉసిరి, వేప మొదలగు పవిత్ర వృక్షములను, భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యచంద్రులను భక్తులు ధ్యానించుచు బుద్ధిని విశాల మొనర్చుకొనుచుందురు.

సర్వము భగవంతునిదేగాని మన దేమియు లేదనియు సర్వము భగవత్స్వరూపమేననియు, దేవుని ఆజ్ఞలేనిదే యేదియు వచ్చుటలేదు, పోవుటలేదనియు భక్తులు భావించుచుందురు.

## సుగుణ ధ్యానములు

కామమును వదలి నిష్కామమును ధ్యానించవలెను. క్రోధమును వదలి శాంతమును ధ్యానించవలెను. లోభగుణమును వదలి త్యాగస్వభావమును చింతించుచుండవలెను. నాది, నావారు అను భావములను త్యజించి సర్వము నీదే, అందరు నీవారే యను నిస్సంగత్వమును ధ్యానించవలెను.

శత్రుత్వమును వదలి సోదరత్వమును ధ్యానించవలెను. అపకారబుద్ధిని వదలి ఉపకారగుణమును గుర్తులో నుంచుకొనవలెను. చాంచల్యములను వదలి నిశ్చలత్వమును ధ్యానించవలెను. వికారము నొందుట మాని, నిర్వికారత్వమును భావించుచుండవలెను.

## ఆత్మధ్యానము

నిర్వికారముగా, నిత్యానందమయముగా యున్న తెలివియే ఆత్మ. ఈ స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు నేను గానని, జాగ్రదావస్థ, సుషుప్త్యవస్థయు, స్వప్నావస్థయు నాకు లేవనియు తెలిసికొనుచున్న తెలివియే నేను గాని తెలియబడుచున్నవి అనాత్మయనియు ధ్యానించుచుండవలెను.

మనోబుద్ధి, చిత్త, అహంకారములకు, సుఖదుఃఖములకు, చావు పుట్టుకలకును విలక్షణముగానున్న తెలివియే నేను యని ధ్యానించుచుండవలెను.

సూర్యచంద్రాది దేవతలలో, మానవులలో, పశుపక్ష్యాదులలో నున్న ఆత్మయే నేను అని ధ్యానించవలెను.

ఈ జగము, సంసారము, దేహము, ఇంద్రియములున్ను సంకల్పమయము లనియు, నిర్వికల్పస్వరూపమే నేను అనియు ధ్యానించవలెను.

ఎవరు దేనిని ధ్యానించుచుందురో వారు దానినే పొందుచుందురు.

సంకల్పమయమగు మనస్సు నశించనంతవరకును ధ్యానములు క్రియలు నుండును.

6

మనస్సు ముందు నడచిపోవును. శరీరము వెనుక నడచును.

ముందు మనస్సు మాట్లాడును. తరువాత వాక్కు మాట్లాడును.

మనస్సు నశించిన మహాత్ములకు రాకపోకలుండవు.

మనస్సు నశించనంతవరకును స్వాత్మనిష్ఠ స్థిరము కానేరదు.

గురుధ్యానము, దైవధ్యానము, ఆత్మధ్యానము, శాస్త్ర ధర్మచింతనయును మనస్సు నశించువరకు నుండవలెను.

సేవ, త్యాగము (దానము) ల ద్వారా స్థూల దేహమును పరిశుద్ధ మొనర్చుకొనవలెను,

స్తుతి, స్మరణలు చేయుచు కామక్రోధ లోభాది దుర్గుణములను నశింపజేసికొనుచు సూక్ష్మదేహమును శుద్ధ మొనర్చుకొనవలెను.

దేహాభిమానము విడుచుచు, మనస్సాక్షియగు పరమాత్మధ్యానము చేయుచు, నిరాకార నిర్గుణ నిర్వికల్ప అఖండ, అనంత భావములను అభివృద్ధి పరచుకొనుచు కారణ శరీరమును దాటవలెను. ఇదే జప, ధ్యానముల ఫలితము.

ధ్యానయోగము నభ్యసింపదలచినవారు ఇంద్రియ విషయ భోగములను త్యజించి ఏకాంతవాసముతో (ఇతరులతో సంబంధము విడిచి) సంతోషించుచుండవలెను.

వైరాగ్యముగలవారికి ఏకాంతవాసము స్వర్గముగా నుండును. లేనిచో నరకముగా తోచును. ఇది మొదటి అనుభవము.

భగవన్నామస్మరణ, జపధ్యానములతో హృదయము ఆనందముతో నుండుట రెండవ అనుభవము.

దేహము, ధనము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు నాకు లేవు, అవి నేను గాను అను నిశ్చయముతో ఆత్మధ్యానముచేయుచు స్త్రీ పురుష, మన్ను బంగారము, స్తుతి నింద యను భేదభావములను త్యజించుచు ఆనందమనుభవించుచుండుట మూడవ అనుభవము.

అఖండ అనంత ఆత్మానుభూతిని స్థిరమొనర్చుకొని సుఖదుఃఖములకు, నామరూపములకును అతీతమైన కైవల్య సుఖము నొందుట నాలుగవ అనుభవమగును. ఇందులో జీవుడు, జగము, దేవుడు అను భేదములు నశించి ఏకైక పరబ్రహ్మానుభూతి సుస్థిర మగును.

ఉదయమునుండి రాత్రి నిద్రించువరకును చెడు పనులు చేయక, చెడ్డమాటలు మాట్లాడక, చెడుగుణములను పుట్టనీయక దేవుని సేవ, పెద్దల సేవ, పేదల సేవ, రోగులసేవ, దైవప్రార్థన, భగవన్నామస్మరణ, గురుధ్యానము, దైవధ్యానము, సద్గ్రంథపఠన మొదలగు పుణ్యకార్యములను చేయుచు నుండవలెను.

వైరాగ్యము లేనివారికి, అహింసావ్రతము లేనివారికి, అధికముగా మాట్లాడువారికి, లోక విషయములను చూడవలెనను వినవలెనను అభిలాష గలవారికి, అధికముగా భుజించువారికి, అధికముగా తిరుగువారికిన్ని జప ధ్యాన నిష్టలు కుదరవు.

ప్రశ్న : జపమును, ధ్యానము నెంత కాలము చేయవలెను ?

సమా: బంధము గలిగించే సంకల్పములు దుఃఖములు వచ్చుచున్నంత వరకును జపమును చేయుచుండవలెను.

ఇట్లే బంధము గలిగించే లోక విషయములు కనబడుచున్నంత వరకును సగుణ ధ్యానమునుగాని నిర్గుణ ధ్యానమునుగాని చేయుచునే యుండవలెను. మరియు నేను చేయుచున్నాను అను అహంకారము నశించు వరకును జపధ్యానాది సత్కర్మల జేయుచునే యుండవలయును.

ఓమ్

భగవద్గుణ క్రియా ప్రతిపాదక

సర్వేశ్వరాది నామస్తోత్ర శ్లోకములు

శ్లో. సర్వేశ్వర స్సర్వ సాక్షీ సర్వజ్ఞ స్సర్వతో ముఖః
సర్వాంతర స్సర్వజయీ సర్వాధారశ్చ సర్వదృక్.
,, సర్వశక్తి స్వరూపశ్చ సర్వానంద స్వరూపకః
సర్వేంద్రియ ప్రేరకశ్చ సర్వయోగ వినిశ్చితః.
,, సర్వేంద్రియ గుణాభాసః సర్వేంద్రియ వివర్జితః
సర్వాసు నిలయ స్సర్వ భర్తా సర్వాసు నాశనః.
,, సర్వవ్యాపీ సర్వదీన శరణ్య స్సర్వ సమ్మతః
సర్వ భోక్తా సర్వసమః సర్వకర్మ ఫలప్రదః.
,, సర్వ యజ్ఞాధిపశ్చైవ సర్వకారణ కారణం
సర్వదేవాధిప స్సర్వ ప్రేరక స్సర్వ కార్యకృత్.
,, సర్వభూతాధివాసశ్చ సర్వలక్షణ లక్షితః
సర్వతీర్థాత్మక స్సర్వకామద స్సర్వపాలకః.

శ్లో. సర్వాభి సంధి ఫలదః సర్వరోగ భిషగ్వరః
సర్వ తేజ స్వరూపశ్చ సర్వలీలా వినోదకృత్.
,, సర్వకాల స్వరూపశ్చ సర్వభూతి స్వరూపకః
సర్వస్వభావ రూపశ్చ సర్వధర్మ స్వరూపకః.
,, సర్వజీవాంత రాత్మాచ సర్వోపద్రవ నాశనః
సర్వాది స్సర్వ విత్సర్వ దర్శీ సర్వ సహోపిచ.
,, సర్వాత్మా సర్వతశ్చక్షుః సర్వప్రహరణాయుధః
సర్వ భూతాత్మ భూతాత్మా సర్వ వాగీశ్వరేశ్వరః.
,, సర్వవేదస్తుత స్సర్వః సర్వశస్త్ర భృతాంవరః
సర్వదేవమయ స్సర్వ గ్రహరూపశ్చ శాశ్వతః.
,, ఏవం లక్షణ సంయుక్తో భగవాన్ భక్తవత్సలః
వాసుదేవో జగన్నాథః పాతు సర్వత్ర సర్వదా.

( ఇది మనస్సాక్ష్య మను తత్త్వగ్రంథమునుండి )

## స్వస్తి వాచకములు

శ్లో. స్వస్త్యస్తు విశ్వస్యఖలః ప్రసీదతాం
ధ్యాయంతు భూతాని శివం మిథోధియా
మనశ్చ భద్రం భజతు అధోక్షజే
హ్యావేశ్యతాం నో మతి రప్యహైతుకీ.

తా. (1) లోకమునకు మేలు కలుగును గాక. (2) దుర్మార్గుడు ప్రసన్నుడగునుగాక—అనగా మంచిమనస్సు గలవాడగునుగాక (3) ప్రాణులు ద్వేషభావము లేనివై శుభమునే భావించుచుండునుగాక. (4) మనస్సు శుభముగనుండును గాక. (5) మా మనస్సు భగవంతునియందు నిష్కామ భక్తితో నిలుచునుగాక. (భాగవతము - ప్రహ్లాదుడు)

దేవుని స్వరూపము చెప్పెద వినుము

శ్లో. బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం తం దేవం సదావిదుః.

దేవుడెపుడు కనబడునో చెప్పెద వినుము

సీ. సకలేంద్రియంబుల సందడి దీరిన
కాలంబునను దోచు కాలమూర్తి
త్రిగుణంబులును గూడ స్థిమితమొందిన వేళ
గుర్తింప నన్వైన గుణవిరహితు
వృత్తుల యలజడి. రిత్తవోయిన తరి
సత్యమై కనుపట్టు సత్యమూర్తి
భూతపంచకమును బొలిసి పోయిన యప్పు
డొక్కడై కనుపట్టు నురు శరీరు

గీ. వ్యక్తమంతయు నవ్యక్త మైన యపుడు
దృశ్యమెల్ల నదృశ్యమై తెగిన యపుడు
నిత్యమై నిర్మలంబునై నిరవయవము
నగుచు వెలుగొందు దేవు నాశ్రయించు.

దేవునిపై దృష్టి నిలువకుండుటకు కారణములు

సీ. కామహర్షాది సంకలితమై చిత్తంబు
భవదీయ చింతన పదవి సొరదు
మధురాది రసముల మరగి చొక్కుచు జిహ్వ
నీ వర్ణనమునకు నిగుడనీదు

సుందరీముఖముల జూడగోరుచు జూడ్కి
తావకాకృతులపై తగులువడదు
వివిధ దుర్భావములు వినగోరు వీనులు
వినవు యుష్మత్కథావిరచనములు

తే. ఘ్రాణ మురవడి దిరుగు దుర్గంధములకు
దవులు గొలుపదు వైష్ణవ ధర్మములకు
నడగి యుండవు కర్మేంద్రియములు పురుషు
గలచు సవతులు గృహమేధి గలచునట్లు
(భాగవతము)

## శ్రీకృష్ణలీలలు

వేదాలు కందని యా దేవుడే తాను
చల్లముంతల కిట సాధ్యపడియె
ఋషుల కైంకర్యాల కెవ్వ డందడొ వాడె
వెన్నముద్దల కిట వివశుడయ్యె
బొజ్జలో బదునాల్గు భువనాల నిల్పిన
మాధవు డిచ్చట మన్ను మెసవె
హరి హర బ్రహ్మల కందజాలని వాడె
కృప నిట జెలుల యెంగిల్లు తినియె

గీ. దన్ను కీర్తించు సామవేదమ్ము వదలి
వేణు విట దానె ప్రయోగించె విమల ఫణితి
నితర లోకాలు దేశాలు నీర్ష్యపడగ
వలదు భరతఖండమున గోకులము భళిర.

—దేవరకొండ సనత్కుమార శర్మగారు
హిందీప్రచారక్, మచిలీపట్టణము

## శ్రీహరిస్తుతి

### (గుర్వష్టకము)

శ్లో. శరీరం సురూపం తథావా కళత్రం
యశశ్చారుచిత్రం ధనం మేరుతుల్యం
హరే రంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం.

తా. శ్రీహరి పాదపద్మములయందు మనస్సును సంలగ్నము చేయనివారికి సుందరమగు శరీరమును, సుశీల యగు భార్యయు, విచిత్రమగు యశస్సున్ను, మేరుసమాన మగు ధనమున్ను గలిగియుండినను వాటిచే మరణానంతరము పరమునకు ఏమి ప్రయోజన మగును? ఏమి యుపయోగము? ఏమి ఫలము? ఏమి సహాయపడును?

శ్లో. కళత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం
గృహం బాంధవాః సర్వమేతద్ధిజాతం
హరే రంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం.

తా. మనస్సు భగవచ్చరణారవిందముల నైక్యము బొందని మానవునకు భార్యయును, ధనమును, కొమాళ్లును, మనుమలు మొదలగు సర్వమును గృహమును, బంధువులును, ఇవియన్నియు కలిగియుండినను ప్రాణప్రయాణకాలమున వీటిచే నేమి ప్రయోజనము, ఏమి ఉపకారము గలుగును? ఏమి సహాయమును బొందును? ఏమి ఫలము సిద్ధించును?

శ్లో. షడంగాది వేదో ముఖే శాస్త్రవిద్యా
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి

శ్లో. స్థూలం సూక్ష్మం ఇహకిల సుహృదస్సువ్రతంచాభిమానం
దేహే మోహో దృఢతర మణిమా ద్యష్టసిద్ధిశ్చ భోజ్యమ్
ఆయుర్వృద్ధి ర్ధృతిరతికుశలం యావ్వనం మానగర్వం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబవేకస్సహాయః



తా. మనుజునకు ఇహలోకమునగల స్థూలశరీరము, సూక్ష్మశరీరము, మిత్రులు, మంచివ్రతము, అభిమానము, దేహమున మోహము, అణిమాద్యష్టసిద్ధులు, బహువిధములైన భోజ్య వస్తువులు, దీర్ఘాయువు, ధైర్యము, సంతోషము, క్షేమము, యావ్వనదశ, మానము, గర్వము మొదలగునవి యన్నియు పరలోకయాత్రలో నిరర్థకములే యగును. జీవునకు పరలోకయాత్రలో సాంబశివు డొక్కడే సహాయుడు కాగలడు.



శ్లో. సేవాయాచ్ఞా నటనవికటం వాద్యగీతానుమోదః
గంగాసేతుర్గయముఖ సుమహాక్షేత్ర తీర్థాటనం చ
దిక్పాలత్వం దినకర హుతభుగ్దేవతారాధనం వా
సర్వం వ్యర్థం మరణసమయే సాంబవేకస్సహాయః

తా. మానవునకుగల ధనసంపన్నుల సేవ, యాచన, నాట్యము, వాద్యగీతానందము, గంగాగయాప్రయాగాది పుణ్యక్షేత్ర తీర్థాటనము, లోకపాలకత్వము, సూర్యాగ్ని దేవతాపూజనము మున్నగునవి యన్నియు అంత్యకాలమున వ్యర్థములే యగును. మరణకాలమున జీవునకు సాంబశివు డొక్కడే సహాయుడు కాగలడు.

తా. భూమండలమునందు తన పాదపద్మములను రాజాధిరాజుల సమూహము సేవించుచుండెడివారుగా నుండి నను, వారియొక్క మనస్సు పరమేశ్వర చరణకమలములలో లయము నొందకుండిన వీటిచే ప్రాణ ప్రయాణమున నేమి ప్రయోజనము, ఏమి సహాయము నొందును? ఏమి సౌఖ్యము గలుగును? ఏమి లభ్యపడును? అనగా నిష్ప్రయోజనమని భావము.

శ్లో. న భోగే న యోగే నవా రాజ్యభోగే
న కాంతాముఖే నైవ విత్తేషుయుక్తః
హరే రంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం.

తా. జనుడు ఆకాశగమనమును, యోగమును, భోగము ధనసంపదలును, స్త్రీ మొదలైనవాటిని గలిగి యుండినను మనస్సు జగదీశ్వర చరణారవిందములో నైక్యము నొందకుండిన వీటిచే దేహావసానమున నేమి ప్రయోజనము? ఏమి సౌఖ్యము, ఏమి సహాయము, ఏమి లాభము? అనగా ఏమీ ప్రయోజనములేదని భావము.

శ్లో. యశోమేగతం దిక్షుదాన ప్రతాపా
జ్జగద్వస్తుసర్వం కరేయత్ ప్రసాదాత్
హరే రంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం.

తా. జనుడు పూర్వపుణ్యఫలముచే దాన ప్రతాపముల చేత తన కీర్తి యష్టదిక్కులయందు నిండి జగత్తంతయును తన స్వాధీనముగా నుండినను పరబ్రహ్మ పాదపద్మములలో

మనస్సు లీనము గాకుండినయెడల వీటిచే నేమి ప్రయోజనము? ఏమిఫలము? ఏమిశాంతి? ఏమిలాభము?

శ్లో. అరణ్యే నివాసః స్వగేహేచ కార్యః
న దేహే మనో వర్తతే మే అనార్యే
హారే రంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం.

తా. మానవుడు అరణ్యమందైనను లేక తన యింటియందైనను నుండి యయోగ్యమైన దేహమునందు మనస్సునుంచక విరక్తుడై యుండినను హరిచరణకమలములలో మనస్సును నిలుపకపోయిన నాత్మవియోగకాలమున వాటిచే నేమి సహాయము? ఏమిప్రయోజనము? ఏమిగుణము? ఏమిఫలము?

శ్లో. అనర్ఘ్యాణి రత్నాని ముక్తాని సమ్యక్
సమాలింగితా కామినీయామినీషు
హారే రంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం

తా. శ్రేష్ఠములైన గొప్పమణులతో గూడుకొనినవాడుగానుండినను, అమూల్యములగు రత్నరాసులతో గూడినవాడైనను, రాత్రులయందు సుందరులైన స్త్రీలతో రమించువాడుగానుండినను, పరమేశ్వర చరణకమలములలో జిత్తము లయింపకుండిన బరలోకమున వీటిచే నేమి ప్రయోజనము, ఏమి సహాయము, ఏమి సౌఖ్యము, ఏమి లాభము సిద్ధించును? "గురోరంఘ్రిపద్మే" అని పాఠాంతరము. అప్పుడు శ్రీ సద్గురుచరణకమలములో మనస్సును లయము చేయనివారికి ఏమి ప్రయోజనమని పఠనీయము.

శ్లో. గురోరష్టకం యః పఠే త్పుణ్యదేహీ
యతిర్భూపతి ర్బ్రహ్మచారీ చ గేహీ
లభే ద్వాంఛితార్థం పరం బ్రహ్మసౌఖ్యం
గురోరుక్తమార్గే మనో యస్య లగ్నం.

తా. సన్న్యాసియును, రాజును, బ్రహ్మచారియును, గృహస్థుడును—వీరిలో నెవ్వడైనను బవిత్రమైన దేహముగల వాడై యీ గుర్వష్టకమును బఠియించునో, ఎవని మనస్సు గురువుచేత జెప్పబడిన మార్గమునందు లగ్నమైయుండునో వాడు కోరిన ప్రయోజనమును పరబ్రహ్మానందసుఖమును బొందునని భావము. ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్య శ్రీ మచ్ఛంకరాచార్య విరచితం. గురోరష్టకం సమాప్తమ్

ఓమ్ శ్శాంతిః శాంతిః శాంతిః

## పరమశివ స్తుతి

శ్లో. భార్యా పుత్రా గృహ ధన పశుక్షేత్రధాన్యాది సంపత్
కర్ణేభూషా వివిధవసనం కంఠమాల్యాంగుళీయమ్
నానావిద్యా కటితటలసత్స్వర్ణసూత్రం చ గాత్రం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబఏకస్సహాయః

తా. భార్య, పుత్రులు, గృహములు, ధనములు, పశువులు, భూములు, ధాన్యరాసులు, మొదలైన సకల సంపదలు కలిగియున్నను; కర్ణకుండలములు, నానావిధము లైన వస్త్రములు, కంఠమాలికలు, అంగుళీయములు (ఉంగరములు) కలిగియున్నను; అనేకములైన విద్యలు, బంగారు మొలత్రాడుతో శోభిల్లు కటిభాగముగల సుందరమైన

కాయము కలిగియున్నను ప్రాణప్రయాణకాలమునందు ఇందేదియు జీవునకు సహాయము కాజాలదు. అట్టితటి ఐహిక ధనసంపదలు ఎన్నియున్నను వ్యర్థములే యగును. మరణ సమయమున జీవునకు సాంబశివు డొక్కడే సహాయుడు కాగలడు.

శ్లో. తర్కే శబ్దే బహుపరిచయే వేదవేదాంగయోర్వా
మీమాంసాయాం శ్రుతిషు సకలాస్వాగమే వైద్యశాస్త్రే
కిం వాలాపై ర్బహువిధ చతుష్షష్ఠి విద్యాకలాసు
సర్వం వ్యర్థం మరణసమయే సాంబఏకస్సహాయః

తా. తర్కశాస్త్రమునందును, వ్యాకరణశాస్త్రము నందును, వేదముల యందును, వేదాంగములయందును, మీమాంసాశాస్త్రము నందును, సకల శ్రుతులయందును, ఆగమమునందును, వైద్య శాస్త్రమునందును పెక్కు మాటలచే నేమి ఫలము? అనేక విద్యలలోను అరువది నాలుగు కళలలోను అనన్యసామాన్యమైన నైపుణ్యమును సంపాదించుకొనియున్నను అయ్యది జీవునకు ప్రాణప్రయాణ కాలమున ఉపకరింపనేరదు. అట్టియెడ విద్యాపరిచయము, కళానైపుణ్యము సమస్తము నిరర్థకమే యగును. మరణ కాలమునందు జీవునకు సాంబశివు డొక్కడే సహాయుడు కాగలడు.

శ్లో. దారాపుత్రా నరాణాం పరిజనసహితో బంధువర్గ
ప్రియోవా
మాతా భ్రాతా పితావా గురుజనసహితో భోగ
ఐశ్వర్య యుక్తః

విద్యారూపం విమలనయనం యౌవనం మానగర్వం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబవేకస్సహాయః.

తా. ఇహలోకమున మనుష్యులకు భార్యాపుత్రులు, బంధువర్గము, సేవకజనులు, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, గురుజనులు, భోగభాగ్యములు, ధనసంపదలు, విద్య, రూపము, సుందరములైన నేత్రములు, యౌవనము, అభిమానము, గర్వము మున్నగునవి యెన్నికలిగియున్నను ప్రాణప్రయాణకాలమునందు ఇందేదియు ఉపయోగపడనేరదు. అట్టితరి ఐహికవ్యక్తులు, వస్తువులు అన్నియు నిష్ఫలములే యగును. మరణకాలమున జీవునకు సాంబశివుడొక్కడే సహాయుడు కాగలడు.

శ్లో. జ్యోతిష్టోమాద్యఖిల క్రతుభిర్ధ్యాన యోగశ్చవిద్యా
గోత్రం సూత్రం కుల జన మద మాత్సర్య వర్ణాశ్రమం వా
క్షేత్రారామా ద్యఖిలవిభవః పుణ్యపాపంచ చీర్ణం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబవేకస్సహాయః

తా. ఇహలోకమున మానవునకు జ్యోతిష్టోమాది యజ్ఞములు, ధ్యానయోగము, విద్య, ఉన్నతవంశము, మర్యాద, స్వవంశీయులగు జనులు, మదము, మాత్సర్యము, వర్ణాశ్రమము, క్షేత్రములు, ఉద్యానవనములు మొదలుగాగల ఐశ్వర్యము, గొప్ప పుణ్యపాపములు—ఇవి యెన్నియున్నను అంత్యకాలమున సర్వము నిరుపయోగమే యగును. జీవునకు అవసానకాలమున సాంబశివుడొక్కడే సహాయుడు కాగలడు.

శ్లో. స్థూలం సూక్ష్మం ఇహాకిల సుహృదస్సువ్రతంచాభిమానం
దేహే మోహో దృఢతర మణిమా ద్యష్టసిద్ధిశ్చ భోజ్యమ్
ఆయుర్వృద్ధి ర్ధృతిరతికుశలం యౌవ్వనం మానగర్వం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబవీకస్సహాయః



తా. మనుజునకు ఇహలోకమునగల స్థూలశరీరము, సూక్ష్మశరీరము, మిత్రులు, మంచివ్రతము, అభిమానము, దేహమున మోహము, అణిమాద్యష్టసిద్ధులు, బహువిధములైన భోజ్య వస్తువులు, దీర్ఘాయువు, ధైర్యము, సంతోషము, క్షేమము, యౌవ్వనదశ, మానము, గర్వము మొదలగునవి యన్నియు పరలోకయాత్రలో నిరర్థకములే యగును. జీవునకు పరలోకయాత్రలో సాంబశివు డొక్కడే సహాయుడు కాగలడు.



శ్లో. సేవాయాచ్ఞా నటనవికటం వాద్యగీతానుమోదః
గంగాసేతుర్గయముఖ సుమహాక్షేత్ర తీర్థాటనం చ
దిక్పాలత్వం దినకర హుతభుగ్దేవతారాధనం వా
సర్వం వ్యర్థం మరణసమయే సాంబవీకస్సహాయః

తా. మానవునకుగల ధనసంపన్నుల సేవ, యాచన, నాట్యము, వాద్యగీతానందము, గంగాగయాప్రయాగాది పుణ్యక్షేత్ర తీర్థాటనము, లోకపాలకత్వము, సూర్యాగ్ని దేవతాపూజనము మున్నగునవి యన్నియు అంత్యకాలమున వ్యర్థములే యగును. మరణకాలమున జీవునకు సాంబశివు డొక్కడే సహాయుడు కాగలడు.

శ్లో. చింతారత్నం ప్రచురవితరణః కల్పకః కామధేనుః
కాంతాక్రీడా కనకకుసుమాద్యుక్తశయ్యాపధ్యానమ్
స్వాంతః కరణాద్యఖిల విమృతాద్యావతీహ్యాస్తిలోకే
సర్వం వ్యర్థం మరణసమయే సాంబఏకస్సహాయః

తా. మనుష్యునకు చింతామణి, సర్వవస్తుప్రదమగు కల్పవృక్షము, కామధేనువు, కాంతతోడిక్రీడ, స్వర్ణపుష్ప శోభితమైన శయ్యాగారము సర్వతోముఖమైన అంతః కరణము మొదలగునవి యెన్నిగలవో అవి యన్నియు ప్రాణ ప్రయాణకాలమున నిరుపయోగములే యగును. జీవునకు పరలోకయాత్రలో సాంబశివు డొక్కడే సహాయుడై యుపకరించగలడు. కావున బుద్ధిమంతులైన మనుష్యులు ఐహిక వ్యక్తులయందును, వస్తువులయందును, ఆసక్తులుగాక భవబంధవిమోచనకరుడైన పరమశివుని ఆశ్రయించి మోక్షమును బడయుదురుగాక!

శ్లో. ఇత్థం స్తోత్రం పఠతిచ పుమాన్ సర్వదా భక్తియుక్త
స్తస్యావశ్యం పరమకృపయా సాంబమూర్తిః ప్రసన్నః
దత్వా సమ్యగ్విమల మచలజ్ఞాన వైరాగ్య సంప
త్సంఘం భూమా జననమరణాత్తూర్ణ ముద్ధారకశ్చ.

తా. ఇట్లు ఈ స్తోత్రమును భక్తియుక్తుడై పఠించు పురుషునకు సాంబశివుడు మిగుల దయతో ప్రసన్నుడగును. మఱియు యథార్థము, నిర్మలము, నిశ్చలమునగు జ్ఞాన, వైరాగ్య, సంపద నొసంగి అతనిని శీఘ్రముగా జననమరణ సంసారమునుండి ఉద్ధరించును.

శ్రీ శంకరాచార్య విరచితమగు పరమ శివస్తుతి సమాప్తము